TL-FI



# చందమామ

సెప్టెంబర్ 1996




| | | | |
|---|---|---|---|
| వార్తలు- విశేషాలు | ...9 | పరోపకారం! | ...40 |
| ప్రయాణంలో పరంధామయ్య | ...10 | చందమామ బంగారుగడియలు | ..41 |
| పగలా? రాత్రా? | ...16 | మహాభారతం-28 | ...45 |
| రూపధరుడి యాత్రలు-15 | ...17 | అందమైన అనుభూతి | ...52 |
| చందమామ కబుర్లు | ...24 | చందమామ అనుబంధం-95 | ...53 |
| వింతమురళి (బే.క) | ...25 | కళ్యాణి కళ్యాణం | ...57 |
| సముద్రతీర ప్రయాణాలు -11 | ...33 | లోభికి గుణపాఠం | ...62 |
| పంచభూతాల సుందరకాండ | ...37 | ఫోటో వ్యాఖ్యలపోటీ | ...66 |



విడిప్రతి :6.00

సంవత్సర చందా : 72.00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'          సంచాలకుడు : నాగిరెడ్డి



## బాల్యాన్ని కాపాడుకుందాం!

గత జూన్ నెలలో దాదాపు 180 దేశాల కార్మిక మంత్రులు జెనీవాలో సమావేశమై– బాలబాలికలను కష్టమైన పనులకు ఉపయోగించే విధానానికి స్వస్తి పలకాలని నిర్ణయం తీసుకున్నారు! చట్టాలెన్నో ఉన్నప్పటికీ బాలకార్మికుల సమస్య తీరినట్టు లేదు. ఆటపాటలతో, చదువులతో హాయిగా గడిచిపోవలసిన పసిప్రాయంలో పలువురు పట్టెడన్నం కోసం పడరాని పాట్లు పడుతూ ఉన్నారు. అంతర్జాతీయ కార్మిక సంస్థ వెలువరించిన వివరాలను పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్లమవుతుంది. 1995వ సం॥లో ఆసియా (ఇండియా, ఇండొనేషియా) ఆఫ్రికా (ఘానా, సెనెగల్) ఖండాలలో 10-14 మధ్య వయసులో పనులకు వెళ్ళే బాల బాలికల సంఖ్య 73,000,000! తమ సర్వేకు అందనివారు మరెన్నో లక్షలలో ఉంటారని ఆ సంస్థ తెలియజేసింది!

బాలకార్మికులలో చాలామంది తమ సంపాదనను తమ తల్లిదండ్రులకే ఇస్తున్నారు. అంటే, పిల్లల సంపాదన మీద ఆధారపడవలసిన ఆర్థిక దుస్థితిలో వారి తల్లిదండ్రులు ఉన్నారు. కాబట్టి ఆ కుటుంబాల ఆర్థిక పరిస్థితి మెరుగుపడితే తప్ప, పిల్లల బ్రతుకులు బాగుపడవు. ఈ నిజాన్ని గ్రహించి బాలకార్మికులు ఎక్కువగా ఉన్న కొన్ని ప్రాంతాలలో వారి కుటుంబాల ఆదాయం పెంచడానికి కృషి జరుగుతున్నది. ముఖ్యంగా ఆ ప్రాంతాలలోని తల్లులకు ఉపాధి కల్పన ఏర్పాటు చేస్తున్నారు. ఇదొక శుభారంభం అనే చెప్పాలి.

బాల్యం భావిజీవితానికి పునాది వంటిది. దానిని కాపాడుకోవడం మన అందరి కర్తవ్యం!

సంపుటి : 99          సెప్టెంబర్'96          సంచిక : 3

విడిప్రతి : 6.00          సంవత్సర చందా : 72.00






Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

**CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG**

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadapalani, Madras - 600 026.

వార్తలు - విశేషాలు:

# ఎల్సిన్‌కు రెండవసారి అధ్యక్షపదవి

బోరిస్ ఎల్సిన్ ఆగస్టు 9వ తేదీ రష్యా అధ్యక్షుడుగా రెండవసారి పదవీ ప్రమాణ స్వీకారం చేశాడు. మాస్కోలోని, క్రెమ్లిన్ కాంగ్రెస్ భవనంలో దాదాపు 5,000 మంది ప్రజల సమక్షంలో అతి నిరాడంబరంగా జరిగిన ఈ కార్యక్రమం, ఎల్సిన్ అనారోగ్య కారణంగా పదిహేను నిమిషాలలో ముగిసిపోయింది. జూలైలో జరిగిన రెండవసారి అధ్యక్ష ఎన్నికలలో ఎల్సిన్ విజేతగాప్రకటించబడ్డాడు. వెంటనే ఆయన చికిత్స కోసం ఆస్పత్రికి వెళ్ళి 15రోజులు అక్కడ విశ్రాంతి తీసుకుని, ఆగస్టు 6వ తేదీ ఆయన కార్యాలయానికి వచ్చి , 9వతేదీ పదవీ బాధ్యతలు స్వీకరించాడు.



జూన్ 16వతేదీ జరిగిన మొదటి సారి ఎన్నికలలో ఎల్సిన్‌కు గాని, ఆయన ప్రధాన ప్రత్యర్థి అయిన కమ్యూనిస్టు నాయకుడు గెన్నడీ జుగనోవ్‌కు గాని కావలసినంత శాతం ఓట్లు రాలేదు. ఆ ఎన్నికలలో డెమొక్రటిక్ పార్టీ నాయకుడు వ్లాడిమీర్ జిరినోవ్‌స్కీ, మాజీ సోవియట్ యూనియన్ అధ్యక్షుడు మిఖైల్ గోర్బచేవ్ కూడా పోటీ చేశారు.

మొదటి సారే విజయం సాధించగలననిఎల్సిన్ భావించాడు. అయితే, ఆయన అనారోగ్యం, ఫెడరేషన్‌లోని చెచెన్యా తిరుగుబాటు దారులతో విజయవంతంగాని యుద్ధం, దాని పర్యవసానంగా దేశంలో ఏర్పడిన ఆర్థిక సంక్షోభం ఆయన విజయావకాశాలను తగ్గించాయి.

జనవరిలో జరిగిన డ్యూమా (పార్లమెంటు దిగువ సభ) స్పీకర్ ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థి విజయం సాధించాడు. దాంతో 1991వ సం॥లో సోవియట్ యూనియన్ విచ్ఛిత్తితో పతనమై పోయిన కమ్యూనిస్టు పాలనను మళ్ళీ నెలకొల్పాలన్న ప్రచారం బయలు దేరింది. తాను అధికారంలోకి వస్తే విడిపోయిన రిపబ్లిక్కులను మళ్ళీ ఒకటిగా సంఘటితం చేయగలనని కమ్యూనిస్టు నాయకుడు గెన్నడీ జుగనోవ్ మాట ఇచ్చాడు.

పాలనాధికారానికి ఎల్సిన్ వచ్చినా, జుగనోవ్ వచ్చినా ప్రజాస్వామ్యానికి ముప్పు అని గోర్బచేవ్ ప్రచారం చేశాడు. గోర్బచేవ్‌ను వదిలేసి, మిగతా ముగ్గురు నాయకులు అధికారాన్ని పంచుకోవాలని డెమొక్రటిక్ పార్టీ నాయకుడు జిరినోవ్‌స్కీ అభిప్రాయపడ్డాడు. అటువంటి సహకారం ఉన్నట్టయితే అధ్యక్ష ఎన్నికలే అనవసరమని ఆయన చెప్పాడు.

ఎన్నికలకు ముందు జూన్‌లో జరిగిన సర్వేలో ఎల్సిన్‌కు 35 శాతం, జుగనోవ్‌కు 24 శాతం వచ్చాయి. కాబట్టి రెండవ సారి ఎన్నికలు అనివార్యమని అప్పుడే ఊహించారు. రెండవసారి ఎన్నికలలో ఎల్సిన్ విజేతగా ప్రకటించబడ్డాడు.

ఈ ఎన్నికల గురించి అక్కడి ప్రజలలో ఒక ఛలోక్తి ప్రచారంలో ఉందట: సెక్యూరిటీ చీఫ్ ఎల్సిన్ దగ్గరికి వెళ్ళి, "ఒక దుర్వార్త, ఒక శుభవార్త తెచ్చాను," అన్నాడు. "మొదట దుర్వార్త ఏదో చెప్పు," అన్నాడు ఎల్సిన్. "కమ్యూనిస్టు అభ్యర్థి 68 శాతం ఓట్లతో గెలుపొందవచ్చు!" అన్నాడు సెక్యూరిటీ ఛీఫ్. "మరి శుభవార్త మాటేమిటి?" అని అడిగాడు ఎల్సిన్. "తమకు 78 శాతం వస్తుంది!" అన్నాడు సెక్యూరిటీ చీఫ్.



# ప్రయాణంలో పరంధామయ్య

భావదేవరపల్లి గ్రామంలో వుండే మహా పండితుడి కూతురు పెళ్ళీడుకొచ్చింది. తెలిసినవారెవరో మంచి సంబంధం వుందంటే ఆయన పట్నం ప్రయాణమవుతూ, బండి వెంకన్నకు కబురు పెట్టాడు.

ఆ గ్రామం నుంచి పట్నం వెళ్ళాలంటే కాలినడకలో అడవిదారి ఒకటుంది. ఉదయాన బయల్దేరితే సాయంత్రానికి పట్నం చేరవచ్చు. కాస్త డబ్బు ఖర్చుపెట్టగలవారు వెంకన్న గుర్రబ్బండి మీద వెళతారు. ఆబండి రాచబాటలో చుట్టుదారిన వెళుతుంది.

వెంకన్న గుర్రబ్బండిలో అయిదుగురు మనుషులు విశాలంగా కూర్చోవచ్చు. కనీసం నలుగురు మనుషులైనా లేనిదే వెంకన్న బండి కట్టడు. ఒక్క మనిషి కోసం బండి కట్టడు. ఒక్క మనిషి కోసం బండి కట్టాడా, నలుగురు మనుషుల బాడుగ వసూలు చేస్తాడు.

మహాపండితుడి అదృష్టం కొద్దీ అప్పటికే వెంకన్నబండి కోసం ముగ్గురు సిద్ధంగా ఉన్నారు. అందువల్ల ఇక ముహూర్తం కోసం కూడా చూడకుండా ఆయన వెంటనే ప్రయాణం కట్టాడు. వెంట ఒక చిన్న రేకుపెట్టె, మంచినీళ్ళ మరచెంబు తీసుకుని ఆయన ఇంటి బయట కొచ్చేసరికి, వెంకన్న ముగ్గురు ప్రయాణీకుల్ని ఎక్కించుకుని అక్కడికి వచ్చాడు.

గుర్రబ్బండి అడుగున వల లాంటి చక్కీ ఉంది. మహాపండితుడు తన రేకుపెట్టెను చక్కీలో వుంచి, మరచెంబుతో సహా బండెక్కాడు. వెంటనే వెంకన్న గుర్రాన్ని అదిలించాడు. బండి కదిలింది.

బండిలో ముందు ఇద్దరు కూర్చున్నారు. వారిలో సీతయ్య మహాపండితుడికి తెలుసు. రెండోవాడు రంగనాధుడు ఏదో పనిమీద ఆ గ్రామం వచ్చి పట్నం వెళుతున్నాడు. వెనక మహాపండితుడి దగ్గర్లో కూర్చున్న

జొన్నలగడ్డ రామలక్ష్మి

పరంధామయ్య నడివయస్కుడు. సీతయ్య ఇంటికి చుట్టం చూపుగా వచ్చాడు. ఏదో వ్యాపార సంబంధమైన పనిలో ఇప్పుడిద్దరూ పట్నం వెళుతున్నారు.

పరంధామయ్య పక్కనే రేకుపెట్టె ఒక టుంది. మహాపండితుడు బండిలో సర్దుకుని కూర్చోవడంలో తన కాళ్ళను రేకుపెట్టికుతన్ని పెట్టాడు. ఆ విధంగా ఆయనకు మహా సదుపాయంగా ఉంది. కానీ పరంధామయ్య అందుకు అభ్యంతరపెడుతూ, "పెట్టెల్లో దేవుడి బొమ్మలున్నాయి, కాలితో తన్నవద్దు," అని చెప్పాడు.

మహాపండితుడు అప్రయత్నంగా ఆ పెట్టెను కళ్ళకద్దుకుని, కాళ్ళు వెనక్కు తీసుకున్నాడు. అయితే కాళ్ళు ముడుచుకుని కూర్చోవడం ఆయనకు కష్టంగా ఉంది. ముందు కూర్చున్నవాళ్ళు కాళ్ళు వేలాడేసుకున్నారు. పరంధామయ్య కాళ్ళు చాపుకున్నాడు. మహాపండితుడికి మాత్రమే కాళ్ళు చాపుకునేందుకు ఇబ్బందిగా వుంది.

కొంతసేపయ్యాక మహాపండితుడు, పరంధామయ్యతో, "అయ్యా! మీ పెట్టెను కాస్త ఇటుగా తోయండి. కాలు చాపకపోతే నాకు ఇబ్బందిగా ఉంది," అన్నాడు.

ఏమనుకున్నాడో ఏమో, పరంధామయ్య పెట్టెను మహాపండితుడి వైపుకు తోశాడు.

అప్పుడు మహాపండితుడు పెట్టెమీద చెయ్యి ఆనించి, కాలు ముందుకు చాపుకుని సుఖంగా కూర్చున్నాడు. అది చూసిన పరంధామయ్య ఆయనను పెట్టెమీదినుంచి చేతిని తీయమన్నాడు.

మహాపండితుడికి చిరాకు వచ్చి, "ఇది కాలు కాదు చెయ్యి," అన్నాడు.

"పెట్టెలోపల గాజుసామానుంది. పెట్టెను నొక్కితే సామాను బద్దలైపోతుంది," అన్నాడు పరంధామయ్య.





"అయ్యా! ఇది రేకుపెట్టె కదా- అంత సులువుగా నొక్కుకు పోదు," అని మహా పండితుడు నెమ్మదిగా సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

పరంధామయ్య తల అడ్డంగా వూపి,"ఆ రేకు పల్చనిది. గాజు సామానుపెట్టె పై భాగంలో ఉంది. సాటి ప్రయాణీకుడికి ఇబ్బంది కలిగించడం మంచి పద్ధతి కాదు. దయచేసి మీ చేతిని పెట్టె మీదినుంచి తీయండి," అన్నాడు.

ఆయన మర్యాదగా చెప్పడంతో, మహా పండితుడి కేమనాలో తెలియలేదు. ఆయన ఒక్కక్షణం ఆలోచించి, "అలాం టప్పుడు మీరు పెట్టెను బండికింద చక్కీలో ఉంచవలసింది. నాకు కూర్చోవడానికి చాలా ఇబ్బందిగా ఉంది," అన్నాడు.

"పెట్టెలోపల దేవుడి బొమ్మలున్నాయి. గాజుసామానుంది. అందుకే పెట్టెను దగ్గరుంచుకున్నాను. అందువల్ల మీకిబ్బంది కలక్కూడదు. బండిలో ఇంకొక మనిషికి ఖాళీ ఉంది. ఆ స్థలంలో నేను నా పెట్టెను వుంచాను. మరొక మనిషి కూర్చుంటే మీరాయన్ని కాళ్ళతో తన్నరు కదా! భుజం మీద చేయి వేసి కూర్చోరు కదా! అప్పుడు లేని ఇబ్బంది ఇప్పుడెందుకొచ్చింది?" అన్నాడు పరంధామయ్య.

దీనికి మహాపండితుడు బదులివ్వలేక పోయాడు. పరంధామయ్య మహాగడ్డుమనిషి అని మాత్రం ఆయనకర్థమయింది.సమయం చూసుకుని తనూ ఆయన్ను దెబ్బ తీయాలనుకున్నాడు.

అలా కొంతసేపు ప్రయాణం సాగాక, పరంధామయ్య చేతిలోకి చుట్టను తీసుకుని నిప్పుపెట్టె కోసం సీతయ్యనడిగితే అతను లేదన్నాడు. మిగతా ఇద్దరి వద్ద కూడా నిప్పు పెట్టెలేదు. పరంధామయ్య బాధగా నిట్టూర్చాడు.

కాసేపటికి మహాపండితుడికి దాహం వేసింది. ఆయన తన పక్కనున్న మరచెంబు మూత తిప్పుతుంటే, పరంధామయ్య, "అయ్యా, తమరు బండిలో మంచినీళ్ళు తాగవద్దు. బండి కుదుపుతున్నది గదా! నీళ్ళు చెదిరి మనుషుల మీద పడతాయి. ఎంగిలినీళ్ళు అసహ్యం కదా! కొన్ని చుక్కలు పవిత్రమైన నా పెట్టె మీద కూడా పడవచ్చు. కాబట్టిమరచెంబుమూతవిప్పకండి," అన్నాడు.

"నాకు దాహం వేస్తున్నది. బండిని ఆపమని చెప్పేదా?" అన్నాడు మహాపండితుడు కోపాన్నణుచుకుంటూ.

"నాది మరీ అవసరమైన ప్రయాణం. తమ సంగతి తెలియదు. కానీ చీటికీ మాటికీ బండినాపితే ప్రయాణం ఆలస్యమవుతుంది. ప్రాణం పోయేలా అనిపిస్తే తప్పదు కానీ, దాహానికి ఓర్చుకోవడం మంచిది," అన్నాడు పరంధామయ్య.

మహాపండితుడి కుక్రోషం వచ్చి మంచి నీళ్ళు తాగలేదు. బండి మరి కాస్త దూరం వెళ్ళేసరికి, ఆయనకు దూరంగా ఒక మనిషి కనిపించాడు. గుప్పుగుప్పున వాడు పొగ వదలడం గమనించి, పరంధామయ్యతో, "అయ్యా! ఎవడో చుట్ట కాలుస్తూ మనకు ఎదురొస్తున్నాడు. బండినాపమని చెప్పేదా?" అన్నాడు.

ఇందుకు పరంధామయ్య ఎంతో సంతోషించి, వెంకన్నతో బండినాపమని చెప్పాడు. మహాపండితుడు మరచెంబుతో కిందికి దిగి, "ఆ మనిషి నాకు తెలిసిన వాడులా ఉన్నాడు. కానీ గొంతెండిపోయి మాట రావడం కష్టంగా ఉంది. మంచినీళ్ళు తాగేదా?" అన్నాడు. "బండిలో అయితే అభ్యంతరం కానీ, బాట మీద అయితే నాకేం నష్టం?" అన్నాడు పరంధామయ్య.

మహాపండితుడు మంచినీళ్ళు తాగేసరికి, ఆ మనిషి దగ్గరయ్యాడు. ఆయన వాణ్ణి పలకరించగానే, "తమరా, బాబూ! గుర్తు పట్టలేదు. మన్నించండి," అంటూ చుట్ట నోట్లోంచి తీసి దూరంగా విసిరేశాడు.

"అయ్యో ఎంతపని చేశావురా! ఆ చుట్ట కోసమే కదా నిన్ను పలకరించింది!" అంటూ మహాపండితుడు వాడికి పరంధామయ్య అవసరం చెప్పాడు.

"ఫరవాలేదు, బాబయ్యా! అది ఎడ్లలంక పొగాకుచుట్ట. ఒక పట్టాన ఆరదు. ఆ పక్కన పొదల్లో పడ్డట్టుంది. తెచ్చి వారి కిచ్చేదా?" అన్నాడా చుట్టకాల్చేమనిషి.





"నేలమీద చెత్తాచెదారంలో పడ్డ చుట్టను, మళ్ళీ ముట్టుకుంటావా? నీకు బుద్ధుందా?" అన్నాడు మహాపండితుడు.

"బాబయ్యా! చుట్ట కాల్చేవాళ్ళకు అది వెలిగించే దాకా బుద్ధి మందగిస్తుంది. ఆ బాధ నాకు తెలుసు. చెత్తలో పడినా నిప్పు నిప్పే కదా!" అన్నాడు చుట్టకాల్చేవాడు.

"ఒరే, ఇక నోరుముయ్యి! పరంధామయ్య గారు అందరిలాంటి మనిషి కాదు. పవిత్రత కోసం ప్రాణం పణంగా పెడతాడు. నీదారిన నువ్వు వెళ్ళు," అని వాడిని పంపేసి, మళ్ళీ బండెక్కాడు మహాపండితుడు.

తర్వాత కొంచెం ఆగి, మహాపండితుడు పరంధామయ్య కేసి చూస్తూ, "మీ చుట్టపని అవలేదు కానీ, ఆ పేరు చెప్పి నా దాహం తీరింది," అన్నాడు.

ఏదో విధంగా చుట్ట వెలిగించాలనుకున్న పరంధామయ్యకు మనసులో ఉక్రోషం పుట్టినా, పైకి ఏమీ అనలేక వూరుకున్నాడు.

అయితే మహాపండితుడు మాత్రం వూరుకోలేదు. దారిపొడుగునా ఆయన నిప్పు కోసం గాలిస్తూనే వున్నాడు. ఒకసారి ఒకడు పళ్ళెంలో నిప్పులు పోసుకుని వెళుతుంటే బండిని ఆపాడు. అది హోమాగ్నిట. దాంట్లో చుట్ట కాల్చరాదట.

మరొక చోట ఒకడు ముంతలో నిప్పు తీసుకుని వెళుతున్నాడు. అది మాంసం కాల్చిన నిప్పని వదిలిపెట్టాల్సి వచ్చింది. దారిలో ఒక చోట ఏవో రాళ్ళను చూసి, అవి చెకుముకిరాళ్ళని చెప్పి బండిని ఆపితే- ఆ రాళ్ళతో ఎంత ప్రయత్నించినా నిప్పురవ్వలు రాలేదు. మహాపండితుడు మంచినీళ్ళు కాసిని తాగి, "నా దాహం తీరే యోగముంది కానీ, మీకు నిప్పు దొరికే యోగమున్నట్లు లేదు!" అన్నాడు పరంధామయ్యతో.

ఇలా దారిపొడుగునా మహాపండితుడు నిప్పు కోసం ప్రయత్నిస్తూంటే, బండి వెంకన్నకూ మిగతా ప్రయాణీకులకూ కూడా ఆశ్చర్యంగా ఉంది. తననంతగా ఇబ్బంది పెట్టిన పరంధామయ్య కోసం, ఆయన అంతగా శ్రమించడం విడ్డూరమనిపించింది. పరంధామయ్య మాత్రం, "ఇదంతా మంచి నీళ్ళు తాగడానికి వేస్తున్న ఎత్తులే!" అను కున్నాడు.

చివరకు మహాపండితుడు ఒక బాటసారి నుంచి నిప్పుపెట్టెను సాధించాడు. ఆ బాటసారి ఆయనతో, "అయ్యా! నా వద్ద అదనపు పెట్టె ఉంది. ఇది మీ వద్ద వుంచుకోండి.

ప్రయాణంలో అవసరానికి ఉపయోగ పడుతుంది," అన్నాడు.

నిప్పుపెట్టెను తీసుకుని మహాపండితుడు బండెక్కాడు. నిప్పుపెట్టెను పరంధామయ్య కిచ్చాడు.

అప్పుడు పరంధామయ్య ఆనందం వర్ణనాతీతం. ఆయన ఉత్సాహంగా చుట్ట నోట్లో పెట్టుకుని, నిప్పుపెట్టెలోంచి పుల్లను బయటకు తీస్తూండగా, "అయ్యా! తమరు చుట్ట వెలిగించబోతున్నారేమో! నాకు చుట్ట వాసన పడదు," అన్నాడు మహాపండితుడు.

"అయితే ఒక్క క్షణం బండి ఆపుదాం. చుట్టకాల్చక నాకు ప్రాణం కడబట్టినట్లుంది," అన్నాడు పరంధామయ్య.

"మీ సంగతి నాకు తెలియదు కానీ, నాది మరీ అవసరం అయిన ప్రయాణం. చీటికీ మాటికీ బండి ఆపడం నాకిష్ట ముండదు," అన్నాడు మహాపండితుడు.

"మీకు దాహం వేసినప్పుడల్లా బండి ఆపుతూ వచ్చారు కదా! నా కోసం ఎందుకు ఆపరు?" అన్నాడు పరంధామయ్య కోపంగా.

"సాటి ప్రయాణీకుడికి ఇబ్బంది కలక్కూడదని తమరే చెప్పారు. నేను బండిని మంచినీళ్ళ కోసం ఆపానని మీరు పొరబడుతున్నారు. తమకు నిప్పు దొరికే సౌకర్యం కోసం, తమ అనుమతి తీసుకునే బండిని ఆపాను. గుర్తు చేసుకోండి. ఇక చుట్ట సంగతంటారా? ప్రయాణంలో ఆ మాత్రం ఓర్చుకోగలగాలి మరి!" అన్నాడు మహాపండితుడు.

దానికి పరంధామయ్య చిరాకు పడుతూ, "మీకు చుట్ట వాసన పడనప్పుడు, నిప్పుపెట్టెను సంపాయించి పెట్టడ మెందుకు? చుట్ట కాల్చకపోతే దీన్ని నేనేం చేసుకోను," అన్నాడు.

"నేను లేనప్పుడు చుట్ట కాల్చుకునేందుకు ఆ పెట్టె ఉపయోగపడుతుంది. నా పేరే మహాపండితుడు. పేరుకు తగ్గట్లే నాకు పంతమెక్కువని ఇంట్లో అంతా అంటారు. మీరు నాకు ఎన్నో అభ్యంతరాలు చెప్పారు కదా! ఒక్క విషయంలోనైనా మీకు అభ్యంతరం చెప్పడం కోసమే, ఇంత కష్టపడి నిప్పుపెట్టెను సంపాయించి ఇచ్చాను," అన్నాడు మహాపండితుడు.

ఇది వింటూ బండిలో మిగతా ముగ్గురూ నవ్వారు. పరంధామయ్య సిగ్గుతో తల వంచుకున్నాడు.



# పగలా? రాత్రా?

ఫిరాట్లంక జమీందారు ఉపేంద్రరాయుడికి శిస్తులు వసూలు చేసేందుకూ, రైతుల కష్టసుఖాలు తెలుసుకుని దివాణంలో చెప్పేందుకూ చురుకుదనం, తెలివితేటలూ గల ఉద్యోగి కావలసివచ్చాడు. దివాను ఆ విధంగా చాటింపు వేయించాడు. చాలామంది యువకులు వచ్చారు.

జమీందారు పక్కన కూర్చుని వుండగా, దివాను వాళ్ళను ఒక్కొక్కడిగా పిలిపించి, "నువ్వు పన్నెండడుగుల లోతూ, పదడుగుల వెడల్పూ గల గోతిలో పడ్డావనుకో, అప్పుడు ఎలా బయటికి వస్తావు?" అని ప్రశ్నించసాగాడు.

ప్రతి ఒక్కడూ సాయం కోసం కేకలు వేస్తాననీ, ఎవరో వచ్చి లాగుతారనీ జవాబులు చెప్పసాగారు. అయితే, చివరగా ఒక యువకుడు దివానును, "అయ్యా, నేపడ్డ గోతిలో నిచ్చెన ఏమైనా ఉన్నదా?" అని అడిగాడు.

"అక్కడ నిచ్చెన వుంటే, నేనీ ప్రశ్న అడగను కదా?" అన్నాడు దివాను.

"అది పగలా? రాత్రా?" అని అడిగాడు యువకుడు.

"పగలా, రాత్రా అనేది సమస్య కాదు. ఆ గోతిలోనుంచి ఎలా బయటికి వస్తావు? అన్నది ప్రశ్న," అన్నాడు దివాను కాస్త చిరాగ్గా.

దానికాయువకుడు, "అది రాత్రివేళ కానప్పుడూ, నేను గుడ్డివాణ్ణి కూడా అయివుండనప్పుడూ-అసలు నేనా గోతిలో ఎందుకు పడతాను!" అన్నాడు.

ఆ జవాబు విని దివాను ఆశ్చర్యపోతున్నంతలో, జమీందారు చిరునవ్వు నవ్వి, "వెంటనే ఇతడికి ఉద్యోగ బాధ్యతలు అప్పచెప్పండి!" అన్నాడు.

– కోటంరాజు రమాపతి






## 15

[ధీరమతి తన ఇంటికి తిరిగి వచ్చి తల్లితో అన్ని విషయాలూ చెప్పాడుగాని తన తండ్రి విషయం మాత్రం చెప్పలేదు. అతని వెంట పైలాస్ నుంచి వచ్చిన ఒక జ్ఞాని అతనికి ఆ రోజు అతిథిగా వచ్చాడు. ఆ అతిథి భోజనం చేసినాకరూపధరుడి ఇంట తిష్ఠ వేసిన దుర్మార్గులందరూ విశాలమైన గదిలో భోజనాలు ప్రారంభించారు. ఆ సమయంలో రూపధరుడు అక్కడికి మునలి బిచ్చగాడి ఆకారంలో వచ్చి, ధీరమతి ఇచ్చిన ఆహారం తిని, అందరి దగ్గరా అడుక్కో నారంభించాడు — తరవాత]

**రూ**పధరుడి ఇంట పడి తింటున్న ఆ దుర్మార్గులకు ఈ ముసలివాణ్ణి చూసి చాలా జాలి కలిగింది. వారు తమకు తోచినది అతని చేతిలో పెట్టారు. "ఈ ముసలి వాడెవడు? వీడు ఎక్కడి నుంచి వచ్చాడు?" అని కొందరు ఆశ్చర్యంతో అడిగారు.

అక్కడే ఉన్న మేకలకాపరి కాళుడు, "బాబుల్లారా, ఈ ముసలివాణ్ణి ఇక్కడకు వచ్చే దారిలో ఇంతకుముందే నేను చూశాను. మన పందుల కాపరి వెంటబెట్టుకు వచ్చాడు," అన్నాడు. ఈ మాట విని దుర్బుద్ధి పందుల కాపరికేసి తిరిగి, "నీకిదేం పొయ్యేకాలంరా? ఈ నగరంలో తిరుగుబోతులూ, బిచ్చగాళ్ళూ తక్కువయ్యారని ఈ ముసలి ముండాకొడుకును వెంట తెచ్చావా? మీ యజమానిసొత్తు తినేటందుకు బిచ్చగాళ్ళు తక్కువయ్యారనా?" అన్నాడు.

"బాబయ్యా, తమరు గొప్పవారైతే కావచ్చు గాని, మా నౌకర్ల విషయంలో మీరు మహా



"అబ్బో, చాల్లా పెద్ద ఉపన్యాసం ఇచ్చావే? నేను ఈ ముసలాడికిచ్చేదే అందరూ ఇస్తే వీడు మళ్ళీ ఈ ఇంటి ఛాయలకు రాడు!" అంటూ దుర్బుద్ధి తన కాళ్ళ అడుగున ఉన్న పీటను వంగి పైకి తీశాడు.

ఈ లోపల రూపధరుడు అందరి దగ్గరా తలా కాస్త పుచ్చుకుని తన జోలెలో వేసుకుని, దుర్బుద్ధిని సమీపించి, "అయ్యా, ఈ అందరి లోకీ మీరు గొప్పవారు లాగా కనిపిస్తున్నారు. అందుచేత అందరికన్నా ఎక్కువగా ఇవ్వాలి. నేను కూడా ఒకప్పుడు బాగా బతికిన వాణ్ణి. నా కింద అనేకవేల మంది కింకరులుండే వాళ్లు. కాని దేవతలు నాపట్ల ఆగ్రహించి, నన్ను సముద్రాలపై దొంగతనాలు చేయడానికి పంపారు. ఈజిప్టులో నా అనుచరులంతా శత్రువుల చేతుల్లో హతమయ్యారు. నేను దిక్కులేని వాణ్ణయిపోయి ఈవిధంగా ఒంటరిగా దేశాలు పట్టి తిరుగుతున్నాను!" అన్నాడు.

"ఏమిటీ పీడ? తిండి కూడా హాయిగా తినడానికి లేకుండా! దూరంగా నిలబడు! బిచ్చగాడివై ఉండి నీకెంత కండకావరం! నిన్ను మళ్ళీ ఈజిప్టు పంపగలను జాగ్రత్త! అయినా వాళ్ళంతా ఇవ్వకేం చేస్తారూ? వాళ్ళ సొత్తు కాదుగా?" అన్నాడు దుర్బుద్ధి పట్టరాని కోపంతో.

"అయ్యా, తమరు చూడటానికి గొప్పగా ఉన్నా బుద్ధి మాత్రం చాలా చిన్నదిలాగుంది. మీ సొత్తు కానప్పుడే ఇంత పెట్టలేనివారు మీ సొత్తయితే ఉప్పు నలుసు కూడా విదిలించేట్టు లేరే? ఇక్కడ ఇంత తినడానికి ఉన్నది గదా, ఒక చిన్న రొట్టెముక్క పారెయ్య

కఠినంగా ఉంటున్నారు. ఎవరైనా బిచ్చ గాళ్ళను కావాలని వెంట తెస్తారా? కాకపో యినా నాకు తమతో పనేమిటి? నన్ను మా యజమానురాలూ, చిన్న యజమానీ నాలుగు కాలాలపాటు చల్లగా చూడాలి, అంతే!" అన్నాడు పందులకాపరి.

ధీరమతి పందుల కాపరితో, "ఎందుకు నీకీ అనవసరప్రసంగం? అతని నోరే అంత. అతన్ని చూసి మిగిలినవాళ్ళు కూడా పరు షంగా మాట్లాడటం నేర్చుకుంటున్నారు," అని దుర్బుద్ధికేసి తిరిగి, "మనం బలం గల వాళ్ళం గనక ఈ ముసలివాణ్ణి బయటకు గెంటమంటావు! అదేనా నీ సలహా? అలా ఎన్నటికీ జరగదు. నేను చెబుతున్నాను. దానం చెయ్యి. కాని నీకు తినటంలో ఉన్న ఆసక్తి పెట్టడంలో లేదు!" అన్నాడు.

గూడదా, బాబూ?" అంటూ రూపధరుడు అక్కడినుంచి కదిలాడు.

"ఎంత మాట అన్నావురా?" అంటూ దుర్బుద్ధి తన చేతిలో ఉన్న పీట రూపధరుడి వీపున కుడిభుజంపైన విసిరాడు. అది రూపధరుడి వీపున కుడిభుజంపైన బలంగా తగిలింది.

కాని రూపధరుడు ఆ దెబ్బకు చలించ లేదు. అతను తలతిప్పి దుర్బుద్ధి కేసి ఒక్క సారి రోషంగా చూసి, వాకిలివద్ద తన స్థానానికి తిరిగి వెళ్ళి ఇలా అన్నాడు: "ఈ ఇంటా విడను పెళ్ళాడగోరే బాబుల్లారా! నా మాట వినండి. తన సొత్తును సంరక్షించుకునే ప్రయత్నంలో మనిషి దెబ్బతింటే అందులో విశేషం ఏమీ లేదు. కాని ఒక మనిషి పొట్ట కోసం పాకులాడుతూ దెబ్బ తినడం చాలా ఘోరం. మా బిచ్చగాళ్ళను కాపాడే దేవు డెవడైనా ఉంటే ఈ దుర్బుద్ధి పల్లకీ ఎక్కడం అటద్ధమూ పాడె ఎక్కడం మాత్రం నిజమూ అవుతుంది!"

"నోరు మూసుకు కూచుని తింటావా, తిను: లేదా బయటికి నడు! అంతే గాని, ఇలా పేలావంటే నిన్ను అందరమూ కలిసి తాట వొలుస్తాము, జాగ్రత్త!" అన్నాడు దుర్బుద్ధి కోపంగా.

ఆ ముసలి బిచ్చగాడి పట్ల దుర్బుద్ధి అంత క్రూరంగా ప్రవర్తించడం మిగిలినవారికి కూడా అంతగా నచ్చలేదు. "ఆ ముసలి వెధవను కొట్టటమేమిటి?" "ఒకవేళ బిచ్చ గాళ్ళ దేవుడున్నాడేమో!" "ఒకొక్కసారి దేవుళ్ళే ఇలాటి రూపంలో వస్తారు!" అని తలా ఒక మాటా అన్నారు.



ఆ మాటల్లో ఓ ఒక్కటీ దుర్బుద్ధి విని పించుకోలేదు.

కాని తన తండ్రికి తగిలిన దెబ్బ చూసి ధీరమతికి మండిపోతున్నది. అతను తన దుఃఖాన్నీ, ఆగ్రహాన్నీ బలవంతాన అణచి పెట్టుకున్నాడు.

అక్కడ జరిగిన సంగతులు పద్మముఖికీ, ఆమె వెంట వున్న పరిచారికలకూ తెలిశాయి. ఆమె పందులకాపరిని పిలిపించి, "ఆ బిచ్చ గాణ్ణి ఒకసారి పిలుచుకు వస్తావా? ఆయన చాలా దేశాలు తిరిగాట్ట, నా భర్త సమాచారం ఏమైనా చెబుతాడేమో! అడిగి చూస్తాను," అన్నది.

పందుల కాపరి రూపధరుడి దగ్గరకు వెళ్ళి, "అమ్మగారు నిన్నొకసారి రమ్మంటు న్నారు. మా యజమాని వార్తలు నీకేమైనా

తెలిస్తే వింటారట!" అన్నాడు. "మీ యజమాని వార్తలు నాకు చాలా తెలుసు. కాని అవన్నీ చెప్పేందుకు ఇది సమయం కాదు. పొద్దూకినాక ఎవరూ లేనప్పుడు వస్తానని ఆవిడతో చెప్పు!" అన్నాడు రూపధరుడు.

పందులకాపరి పద్మముఖికి ఈ మాట చెప్పివచ్చి ధీరమతితో, "చిన్నబాబూ, ఇక నేను వెళ్ళి నా పందులను చూసుకోవాలి. ఆ ముసలాణ్ణి కాస్త జాగ్రత్తగా చూసుకో! చూశావుగా దుర్బుద్ధి అతన్ని ఎంత లావు దెబ్బ కొట్టాడో?" అన్నాడు.

"ముసలాడి భయం నీకేమీ వద్దులే. నువ్వు మాత్రం భోజనం చేసి మరీ వెళ్ళు!" అన్నాడు ధీరమతి.

పందులకాపరి భోజనం చేసి వెళ్ళేసరికి అపరాహ్నమయింది. అందరూ పాటలలో, నృత్యాలలో మునిగి జల్సా చేస్తున్నారు. ఆ సమయానికి అక్కడికి మరొక బిచ్చగాడు వచ్చాడు. వాడు నగరంలో ఎప్పుడూ అడుక్కు తినేవాడే. వాడు అందరికీ సమాచారం అందజేయడం చేత వాణ్ణి 'దూత' అని పిలిచేవారు.

ఈ దూత లోపలికి వస్తూనే రూపధరుణ్ణి చూసి, "ఏయ్, ముసలాడా!ఎవడవురానువ్వు? అవతలికి పోతావా, లాగిపారెయ్య మన్నావా?" అని గద్దించాడు.

"నేను నిన్నేమైనా అన్నానా, పెట్టానా? నా జోలి నీకెందుకు? నీ మానాన నువ్వు అడుక్కోరాదూ? లాగటం మాట వస్తే, ముసలి వాణ్ణయినా నేనే నిన్ను లాగి పారెయ్యవచ్చు," అన్నాడు రూపధరుడు.

"ఏమిరా నీ పొగరు? లేచి నిలబడు! ఎవరి బలమో తేల్చుకుందాం! ముసలి తొత్తువు నా వంటి పడుచువాని మీదికి కాలు దువ్వుతావా?" అన్నాడు దూత. ఇద్దరు బిచ్చగాళ్ళూ కాట్లకుక్కల్లాగా తయారు కావడం



చూసి దుర్బుద్ధికి పరమానంద మయింది. "స్నేహితులారా, వీళ్లిద్దరిలో ఎవరు గెలుస్తారో తేల్చుకుందాం. వీళ్ళపోట్లాట ఇవాళ మనకొక కొత్త వినోదం!" అన్నాడతను.

అందరూ లేచి వచ్చి బిచ్చగాళ్ళ చుట్టూ మూగారు. "మీ ఇద్దరిలో ఎవరు గెలిస్తే వాళ్ళు రాత్రి దాకా ఇక్కడ ఉండి నిశ్చింతగా కావలసినంత తినవచ్చు. ఓడిపోయినవాణ్ణి ఇక్కడ వుండనివ్వం!" అన్నాడు దుర్బుద్ధి.

"అయ్యలారా, అసలే ముసలివాణ్ణి. పోట్లాడవలసింది పడుచువానితో. మీలో ఎవరూ నన్ను పక్కదెబ్బ కొట్టనని మాట ఇవ్వండి. అలా ఈ దూతకు మీరు సహాయం చెయ్యకుండా ఉంటే నా శక్తికొద్దీ పోరాడ తాను!" అన్నాడు రూపధరుడు.

మధ్యలో అన్యాయం చెయ్యమని అందరూ ప్రమాణాలు చేశారు. తరవాత ధీరమతి రూపధరుడితో, "ఈ ఇంటి పెద్దను నేను. మిగిలినవారిలో కూడా పెద్దలున్నారు. మేమంతా నీకు అన్యాయం జరగకుండా చూస్తాం!" అన్నాడు.

తరవాత రూపధరుడు తన చింకి దుస్తులను కాళ్ళమీదా, చేతులమీదా ఎగదీసి కట్టాడు. అతని బలమైన తొడలూ, పిక్కలూ, జబ్బలూ చూసి అందరూ నిర్ఘాంతపో యారు. "ఇవాళ మన దూతగాడు యమ దూతల పాలే. కొరివితో తల గోక్కున్నాడు, వెధవ!" అని వారనుకున్నారు.

ఇక దూత స్థితి వర్ణనాతీతంగా ఉన్నది. వాడు భయంతో వణికిపోతున్నాడు. వాడి బట్టలు ఎగకట్టడానికి నౌకర్లు సహాయ పడవలసి వచ్చింది. రూపధరుడితో పోట్లాడ టానికి కూడా వాణ్ణి బలవంతాన తొయ్య వలసి వచ్చింది. ఈ దూతను ఒక్క గట్టి గుద్దుతో యమలోకానికి పంపడమా, లేక చిన్నదెబ్బతో పడగొట్టడమా అని రూపధరుడు





చేతిలో పెట్టి, "కుక్కలూ, పందులూ లోపలికి రాకుండా చూస్తూండు. బిచ్చగాళ్ళ కందరికీ నువ్వే చక్రవర్తివనుకోకు. ఇంకా నయం. ఇవాళ తేలికలో పోయింది!" అన్నాడు. తరవాత అతను తిరిగి వచ్చి వాకిలి వద్ద తన యథాస్థానంలో కూచున్నాడు.

సాయంకాలం కాగానే పద్మముఖి, ఎన్నడూ రానిది, కిందికి దిగి వచ్చింది. ఆమె సౌందర్యం చూసి అందరూ తన్మయత్వం చెందారు. ఆమె తన కుమారుడితో, "ధీరమతీ, అంతకంతకూ నువ్విలా అయిపోతున్నావేమిటి, నాయనా? పరాయివాడు మన పంచన చేరితే అతనిపైన చేయి చేసుకోనిస్తావా? ఆ మనిషి కేదైనా ప్రమాదంలాటిది జరిగితే మనకు నలుగురిలో అప్రతిష్ఠకాదా?" అన్నది.

"నీకు కోపం రావటం సహజమేనమ్మా! వీళ్ళంతా నా చుట్టూ మూగి నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నారు. నేనేం చేసేది? ఇంతకూ ఈ వృద్ధుడిమీద చేయిచేసుకున్న దూతకు మంచి శాస్తే అయిందిలే!" అన్నాడు ధీరమతి.

దూరం నుంచి విపులయోధుడనే వాడు, "పద్మముఖీ నీ అందాన్ని దేశంలో ఉండే జనమంతా చూడగలిగితే అందరూ రేపు మీ ఇంటనే ఉంటారు! అందరూ నిన్ను పెళ్లాడగోరుతారు! నిజంగా ఈ దేశపు స్త్రీలకు నీవు ఆణిముత్యానివి!" అన్నాడు.

"నా అందమంతా నా భర్త వెళ్ళిపోయిన నాడే హరించుకు పోయింది. వెళ్ళిపోయే టప్పుడాయన నాతో తాను మరణించిన పక్షంలో మరొకరిని వివాహమాడమని చెప్పిన మాట నిజమే. కాని నా స్వయంవరం ఇంత

వితర్కించుకున్నాడు. ఒక్కదెబ్బతో తాను దూతను చంపేసినట్టయితే ఆ దుర్మార్గులకు తనను గురించి అనుమానం రావచ్చు. అందుచేత చిన్నదెబ్బే కొడదామని రూపధరుడు నిశ్చయించాడు.

ఇద్దరు యోధులూ ఒకరినొకరు ఎదుర్కొగానే దూత రూపధరుడి కుడిభుజాన్ని కొట్ట బోయాడు. కాని రూపధరుడు దూత దవడ మీద ఒక్క దెబ్బ కొట్టేసరికి వాడి దవడ ఎముక విరిగింది. వాడు నోట నెత్తురు కక్కుతూ కింద పడిపోయి కాళ్ళు గిలగిలా తన్నుకున్నాడు. ప్రేక్షకులు చేతులు పైకెత్తి అల్లరిగా నవ్వారు.

రూపధరుడు దూత కాలు పట్టుకుని జరజరా బయటికి ఈడ్చుకుపోయి వాణ్ణి గోడకానించి కూచోబెట్టి, వాడి కర్ర వాడి

అవమానకరంగా ఉంటుందని ఎన్నడూనేను అనుకోలేదు. ఇలాటిది ఎక్కడైనా ఉన్నదా? వరులుగా వచ్చేవారు వధువుకు ఆభర ణాలూ, పశువులూ కట్నాలుగా తెస్తారు. అంతేగాని ఆమె ఇంట తిష్ఠవేసి .ఆమె ఆస్తి యావత్తూ ఇలా తినెయ్యరు," అన్నది పద్మ ముఖి.

ఆమెకు దుర్బుద్ధి ఈ విధంగా సమా ధానమిచ్చాడు: "నీవన్నమాట నిజమే, పద్మ ముఖీ. అందరమూ మాకు తోచిన కట్నాలు తెప్పించి ఇయ్యమంటే ఇస్తాం గాని, మాలో ఒకరిని నువ్వు భర్తగా వరించేదాకా మేమి క్కడి నుంచి మాత్రం వెళ్ళిపోము!"

తరవాత అందరూ తమ మనుషులను పంపించి వెలలేని కట్నాలు తెప్పించి ఇచ్చారు. వాటన్నిటినీ తన దాసీల చేత పట్టించుకుని పద్మముఖి తన గదికి వెళ్ళి పోయింది.

చీకటి పడగానే ముందుగదిలో మూడు చోట్ల అగ్నిహోత్రాలు చేశారు. దివిటీలు వెలిగించారు.

చాలాసేపు అందరూ తాగి నానా అల్లరి చేశారు. విపులయోధుడు రూపధరుడికి ఉద్యోగం ఇస్తానన్నాడు. "అయితే, నువ్వు చాలా దొంగవెధవవి! కష్టపడి పనిచేసే బాపతు కాదు!" అన్నాడతను.

"పొలం దున్నటంలోగాని, కొడవలి తీసు కుని గడ్డి కొయ్యటంలో గాని మనం ఎప్పుడైనా పందెం వేసుకుందాం. ఎవరు ఎక్కువ పని మంతులో తెలుస్తుంది. నువ్వు వట్టి వదరు బోతువు. ఆ రూపధరుడు తిరిగి వస్తే నీ బతుకు తెలుస్తుంది!" అన్నాడు రూపధరుడు హేళనగా.

విపులయోధుడు ఆగ్రహించి అతనిపై ఒక పీట విసిరాడు. రూపధరుడు తప్పుకోగా అది ఇంకొకడికి తగిలింది. వాడు అరవ సాగాడు. అది చూసి ఒక్కసారిగా అందరూ కేకలుపెట్టారు.

ధీరమతి అధికారంతో, "ఏమిటీ అల్లరి? మీరు చెడతాగి కైపెక్కి నా ఇంట వెర్రివాళ్ళ లాగాప్రవర్తిస్తున్నారు. ఇదేమీ బాగాలేదు. తిన్నారు. తాగారు, ఇక వెళ్ళి పడుకోండి!" అన్నాడు.

అందరూ లేచి వెలుపలికి వెళ్ళిపోయారు. ఆ గదిలో రూపధరుడూ, ధీరమతీ మాత్రమే మిగిలారు. – (ఇంకావుంది)



# చందమామ కబుర్లు

## ఇష్టంతో 'ఇంపొజిషన్'!

విద్యార్థులు అక్షరాల తప్పు రాస్తే, లెక్కల సూత్రాలు తప్పు రాస్తే ఉపాధ్యాయులు వాటిని సరిదిద్ది వాళ్ళ చేత 'ఇంపొజిషన్' రాయిస్తూ ఉంటారు. అయితే, కోయంబత్తూరుకు చెందిన ఎమ్. రాజా షెరీఫ్ అనే ముప్పైఏళ్ళ యువకుడు తన ప్రియతమ నాయకుడు రాజీవ్‌గాంధీ పేరును ఇంగ్లీషులో 8,500 సార్లు ఇంపొజిషన్ రాశాడు. దేని మీద అనుకున్నారు? పోస్టాఫీసులో 75 పైసలకు లభించే మామూలు ఇన్‌లాండ్ కవరు మీద! అంటే అతడు ఒక కవరులో 93,500 ఇంగ్లీషు అక్షరాలను ఇమిడ్చాడన్నమాట! దీనిని పూర్తి చేయడానికి అతనికి రోజుకు రెండుగంటల ప్రకారం ఒక వారం పట్టింది. రాజీవ్ జన్మదినం ఆగస్టు 20 సందర్భంగా అతడీ పనికి పూను కున్నాడు. ఈ సంగతి సోనియా గాంధీకి రాశాడు. ఆమె ఆ ఇన్‌లాండ్ కవరును పుచ్చుకుని, రాజీవ్ గాంధీ ఫోటో మీద తన సంతకం చేసి ఆ యువ కుడికి అందజేసింది!

## ఆగకుండా భరతనాట్యం!

ఇరవైయేడేళ్ళ విద్యాచంద్రశేఖర్ అనే యువతి విరామం తీసుకోకుండా 72 గంటల సేపు భరత నాట్యం చేసి సరికొత్త రికార్డు సృష్టించింది. గుండె జబ్బుతో మరణించిన తన తండ్రి జ్ఞాపకార్థం ఆమె ఈ నాట్య ప్రదర్శన ఇచ్చింది. గుండె జబ్బుల గురించి ప్రజలలో స్పృహ పెరగాలన్నది ఆమె ఆశయం. అమెరికా, మిచిగాన్‌లోని ట్రాయ్ నగ రంలో ఏర్పాటు చేసిన ఈ నాట్య ప్రదర్శనను600 మంది చూశారు. ఆమె నాట్యం ముగించేసరికిఆమె పాదాలలో బొబ్బలు లేచాయి. ఎడమమోకాలికిదెబ్బ తగిలింది. ఆమె నీరసించి పోయింది. "పోయిన నా తండ్రిని బ్రతికించుకోలేను. కానీ మీరు మీ కుటుంబాలతో క్షేమంగా ఉండాలి. అదే నాకోరిక!" అని ఆమె కన్నీళ్ళతో ప్రేక్షకులనుద్దేశించి చెప్పింది. ఆమె ఏడేళ్ళ క్రితం ఆగకుండా 48 గంటల సేపు నాట్యం చేసింది. అప్పుడు వసూలైన 10,000 డాలర్లు అమెరికన్ క్యాన్సర్ సొసైటీకి విరాళంగా అందజేసింది.

## నాణాలపై దేవతల తలలు!

నాణాలపై పాలకుల బొమ్మలు ముద్రించడం కొత్తేమీ కాదు. ప్రత్యేక సందర్భాలలో అయితే, ప్రముఖ నాయకుల తలలను, సుప్రసిద్ధుల తలలను నాణాలపై ముద్రించడం ఆనవాయితీ. మనదేశంలో మహాత్మా గాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీ డా॥అంబేద్కర్ తలల బొమ్మలతో నాణాలు విడుదల అయ్యాయి. ఆస్ట్రేలియాలో ఇటీవలి కాలం వరకు రెండవ ఎలిజబెత్ రాణి బొమ్మను నాణాలపై ముద్రించేవారు. ఆ దేశంలో ఇప్పుడు గణేశుడు, శివుడు, పార్వతి మొదలైన హైందవ దేవతల బొమ్మలతో నాణాలను ముద్రించడం ప్రారంభించారు. పెర్త్‌లోని టంకశాలలో ఈ నాణాల ముద్రణ జరుగుతున్నది. 'సిద్ధి వినా యకుడి' బొమ్మతో విడుదల అయిన 20,000 బంగారు నాణాలను బొంబాయిలోని సుప్రసిద్ధ వినాయక మందిరానికి సమర్పించారు.

## లండన్‌లో హిందూదేవాలయం!

లండన్‌లోని నెస్డేన్ ప్రాంతంలో ప్రప్రథమంగా ఒక హిందూ దేవాలయం నిర్మిస్తున్నారు. 70అడు గుల గోపురంతో 27×195 అడుగుల వైశాల్యంతో నిర్మితమవుతున్న ఈ ఆలయంలో నారాయణ (మహావిష్ణువు) విగ్రహం ప్రతిష్ఠించనున్నారు. ఈ ఆలయంలో 26,300 శిల్పాలు చోటు చేసుకుం టాయి. ఆలయ నిర్మాణానికి కావలసిన సున్నపు రాయి, చలవరాళ్ళు, నల్లరాళ్ళు మొదలైన వాటిని బల్గేరియా, ఇటలీ, భారతదేశాల నుంచి తెప్పిం చారు. వాటిని గుజరాత్‌లోని కాండ్లా రేవుకు పంపి, రాజస్థాన్‌కు చెందిన 1,500 మంది శిల్పుల చేత అందమైన శిల్పాలను, స్తంభాలను గోడ పలకలనూ, నేల మీద పరిచే పలకలనూ తయారు చేసి ఓడలలో ఇంగ్లాండుకు తీసుకు పోయారు.



# వింతమురళి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎన్ని ఆశాభంగాలకు లోనైనా నీ వీడని పట్టుదల చూస్తూంటే, హాయి గొలిపే అంతఃపురాన్ని కాక, భీతిగొలిపే ఈ శ్మశానాన్నే నువ్వు కోరుకుంటున్నట్టు శంక కలుగుతున్నది. అదే నిజమైతే, నీది అతి చిత్రమైన మనస్తత్వం అనుకోవాలి. ఎందుకంటే - రాజైనవాడు చక్రవర్తిని కావాలన్న కోరికతో కుమిలిపోతూంటాడు. పేదరైతు భూస్వామిని కావాలన్న కోరికతో అహోరాత్రాలు శ్రమిస్తూంటాడు. ఇందులో అసహజమంటూ ఏమీ లేదు. కాని, ఇలాంటి కొందరు వ్యక్తులు తమ తెలివితేటల కారణంగానో, దైవకృప వల్లనో కోరికలు ఫలించనున్న తరుణంలో వాటిని చేజేతులా

## బేతాళ కథలు



జారవిడుచుకుంటారు. దీన్ని తాత్కాలికంగా వాళ్ళను ఆవహించిన జడత్వం లేక మనో వైకల్యం అనుకోవలసిందే కదా! ఇందుకు ఉదాహరణగా, మోహనకృష్ణ అనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

గోకులపురంలో మోహనకృష్ణ అనే యువకుడుండేవాడు. వాడు గురుకులంలో విద్యాభ్యాసం ముగించి, ఇంటికి తిరిగి వచ్చాడు. వాడి తండ్రికి వాడొక్కడే కొడుకు. వాళ్ళకు పదెకరాల సుక్షేత్రంలాంటి వ్యవసాయ భూమి ఉన్నది. విద్య పూర్తయ్యాక కొడుకు వ్యవసాయప్పనుల్లో తనకు సాయంగా వుంటాడని మోహనకృష్ణ తండ్రి దివాకరుడు ఆశించాడు. కాని, వాడు ఇంటెదురుగా ఉన్న రావిచెట్టు కింద కూర్చొని ఏవేవో పగటి కలలు కంటూండేవాడు. ఇలా ఒక నెల గడిచాక, కొడుకు ప్రవర్తనకు విసుగు చెందిన దివాకరుడు, ఒకనాడు మోహనకృష్ణతో, "బాబూ, పొద్దస్తమానమూ ఏ పనీ పాటా లేకుండా, ఎందుకలా కాలం వృధా చేస్తావు? నాకా వయసు మీద పడుతున్నది. పొలం పనుల్లో నాకు సాయంగా రా," అన్నాడు.

ఈ మాటలకు మోహనకృష్ణ అయిష్టంగా తల వూపి, "నాన్నా, మనం ఎంత కష్టించి పనిచేసినా, గొర్రెకు బెత్తెడు తోకలా ఎదుగూ బొదుగూ లేని వ్యవసాయం. నాకు ఒకే ఒక్క నెల గడువివ్వు. నేను పాపికొండల ప్రాంతాన గల అరణ్యానికి పోయి, అక్కడ తపస్సు చేసుకునే మునులలో ఎవరో ఒకరి ఆశీర్వాదం పొంది తిరిగి వస్తాను. ఆ తర్వాత మనం సిరిసంపదలతో తులతూగవచ్చు," అన్నాడు.

గురుకులం చదువు తన కొడుకులో లేనిపోని ఆశలకు కారణమయిందని గ్రహించిన దివాకరుడు, చేసేది లేక ఇందుకు సరేనన్నాడు. వాడి తల్లి దిగులుతో మౌనంగా వుండిపోయింది.

మర్నాటి ఉదయం మోహనకృష్ణ భోజనం చేసి, దారిలో తినేందుకు ఇన్ని రొట్టెలు మూట గట్టుకుని పాపికొండలకు బయలు దేరాడు. వాడు మిట్టమధ్యాహ్నం వేళకు అరణ్యంలోని ఒక కొలను ప్రాంతాన్ని చేరాడు. కోతి ఒకటి చెట్టుకొమ్మల్లోంచి హఠాత్తుగా కిందికి దూకింది. దాని చేతిలో వెండిపొన్ను గల వింత మురళి ఒకటున్నది. మోహనకృష్ణ కోతికేసి ఆశ్చర్యపోతూ చూసేంతలో, అది

మురళిని నేలకు జారవిడిచి, అతడి చేతిలో ఉన్న రొట్టెల మూటను లాక్కుని కొమ్మల్లోకి పారిపోయింది. వాడు కోపంతో చెట్టుకొమ్మల కేసి ఒకసారి చూసి, కోతి కనబడక పోయేసరికి, ఉసూరుమంటూ, అక్కడ పడివున్న మురళిని తీసుకుని, కొలనులో ఇన్ని నీళ్ళు తాగి ముందుకు నడిచాడు.

వాడు అలా కొండలకేసి కొంతదూరం వెళ్ళేసరికి, శతవృద్ధుడయిన ఒక ముని అతడికి ఎదురయ్యాడు. ఆయన తల, పొడవాటి గడ్డం తెల్లగా పండిపోయి వున్నాయి. ఆయన కళ్ళు జ్ఞానజ్యోతుల్లా మిలమిలా మెరుస్తున్నాయి. మోహనకృష్ణ అప్రయత్నంగా ఆయనకు సాష్టాంగపడ్డాడు.



ముని వాణ్ణి ఆప్యాయంగా లేవనెత్తి, ఏదో చెప్పబోతున్నవాణ్ణి కళ్ళతోనే వారించి, "నాకంతా తెలుసు, నాయనా! నువ్వీ ప్రాంతాన గల మునులలో ఎవరినైనా ఆశ్రయించి, కోర్కెలను నెరవేర్చుకోవాలని వచ్చావు. నీ చేతిలో వున్నది మామూలు మురళి కాదు; గొప్ప మహత్తు గలది. దాన్ని ఊదేవారికి తప్ప, ఆ నాదం ఎవరు విన్నా వారికి నిద్ర ముంచుకు వస్తుంది. ఇందుకు పశు పక్ష్యాదులు, రాక్షసులు కూడా మినహాయింపు కాదు. మరొక సంగతి. మనిషి కోరికలు అతడి తాహతుకూ, శక్తిసామర్థ్యాలకూ, బుద్ధి వివేకాలకూ మించినవిగా ఉండరాదు. అలా కానప్పుడు అవహేళనలకూ, అవమానాలకూ గురి కావలసి వస్తుంది. ఇది నా హెచ్చరిక!" అని తన దారిన తాను వెళ్ళిపోయాడు.

మోహనకృష్ణ, ముని మాటలకు అబ్బురపడ్డాడు. వాడు సంతోషంగా వెనుదిరిగి ఊరుదారి పట్టాడు. వాడలా పది బారల దూరం నడిచాడో లేదో, సింహగర్జన వినవచ్చింది. మరుక్షణం లేడినొక దాన్ని తరుముకుంటూ, సింహమొకటి అటుగా వచ్చింది. వాడు భయంతో వణికిపోతూ పక్కనే ఉన్న చెట్టు పైకి పోయాడు. ఇంతలో వాడికి తన మహిమ గల మురళి గుర్తు కొచ్చింది. మురళిని పెదాలకానించి ఊద సాగాడు. వెంటనే సింహం, లేడి రెండూ కింద పడి గాఢనిద్రలోకి జారుకున్నాయి. వాడలా కాసేపు ఊది, అలుపు తీర్చుకునేందుకు క్షణ కాలం ఊదడం ఆపేసరికి సింహం, లేడి ఉలిక్కి పడి నిద్రలేచాయి. పరిగెత్తుతున్న లేడినితరుముకుంటూ సింహం చెట్లలోకి వెళ్ళిపోయింది.

ఇంతలో, దాపులనున్న పెద్దమర్రిచెట్టు పై నుంచి ఒక బ్రహ్మరాక్షసి, మోహనకృష్ణ ముందు దూకింది. దాన్ని చూసి వాడు




ప్రాణభయంతో గజగజ వణుకుతున్నంతలో, రాక్షసి, "ఒరే, నాకు చాలా ఆకలిగా ఉన్నది. నువ్వు వణకుతూ అలా కాలం వృథా చేయకుండా మూర్ఛపోయావంటే, నిన్ను తిని ఆకలి తీర్చుకుంటాను," అన్నది.

ఇందులో ఏదో రహస్యం ఉన్నదని మోహనకృష్ణ వెంటనే గ్రహించి ధైర్యం తెచ్చుకుని, "ఏమిటీ, నేను మూర్ఛపోందే తిన లేవా?" అని అడిగాడు.

అందుకు రాక్షసి ఒక నిట్టూర్పు విడిచి, "ఏం చెప్పేది! ఒకసారి నేనొక అడవిదున్నను పట్టి తిని, దాని ఎముకల గూడును బలంగా విసిరేశాను. అది పోయి ఒక ముని ఆశ్రమంలో పడింది. ముని కోపగించి, మేలుకుని లేదా స్పృహలో వున్న ఏ ప్రాణిని తిన్నా, నా తల బద్దలవుతుందని శపించాడు!" అన్నది.

ఆ మరుక్షణం మోహనకృష్ణకు తన వద్ద వున్న మురళి గుర్తుకు వచ్చింది. దాన్నివాడు ఊదబోయేంతలో బ్రహ్మరాక్షసి లాక్కుని, అటూ ఇటూ తిప్పి చూసి, "ఆహాఁ వెండిపొన్ను మురళా?" అని ఊదసాగింది.

మోహనకృష్ణ తన చెవులకు మురళీరవం సోకకుండా, రెండు అరచేతులతో చెవులను కప్పుకున్నాడు.

ఇది గమనించిన రాక్షసి, "అవమానం! నేను మురళి ఊదుతుంటే నువ్వు చెవులు మూసుకుంటావా? నువ్వు ఎంత బాగా ఊదగలవో చూస్తాను," అంటూ మురళిని మోహనకృష్ణ మీదికి గిరవాటేసింది.

బ్రతుకుజీవుడా అనుకుంటూ వాడు మురళిని తీసుకుని ఊదసాగాడు. రాక్షసి "అద్భుతం, పరమాద్భుతం!" అంటూ నేల మీద వాలిపోయి, గుర్రుపెట్టి నిద్రించసాగింది.

ఇదే మంచి అదననుకుని మోహనకృష్ణ అక్కడినుంచి పరిగెత్తసాగాడు. వెంటనే మెలకువ వచ్చిన రాక్షసి, "ఒరే, ఆగు!" అంటూ పెద్ద పెద్ద అంగలతో వాడి వెంటపడింది.

ఇంతలో, ఒక అందమైన పల్లకీ మోహనకృష్ణకు ఎదురొచ్చింది. నలుగురు బోయీలు పల్లకీని మోస్తున్నారు. పదిమంది భటులు గుర్రాల మీద రక్షణగా వస్తున్నారు. వాళ్ళను చూసి రాక్షసి పెద్దగా, "ఆహాఁ అదృష్టమంటే ఇదే! ఒకణ్ణి తరుముకుంటూ వస్తూంటే, ఇంత మంది మనుషులు ఎదురయ్యారు," అంటూ వికటంగా నవ్వింది.

రాక్షసి నవ్వు విని పల్లకీ తెర తొలగించి, ఒకసుందరితలబయటపెట్టింది. మేఘాల చాటునుంచి బయటపడిన చందమామలాగా

ఆమె ముఖం ఎంతో అందంగా ఉంది. "ఆహాఁ అందమంటే ఈమెదే! పెళ్ళంటూ చేసుకుంటే ఈమెనే చేసుకోవాలి," అనుకున్నాడు మోహనకృష్ణ.

రాక్షసిని చూసి భటులూ, పల్లకీలోని యువతీ ప్రాణభయంతో కంపించిపోసాగారు. రాక్షసి తన కిప్పుడు ఒకేసారి చాలామంది మనుషులు దొరికారన్న సంతోషంతో, అడుగులో అడుగేసుకుంటూ తాపీగా నడిచి రాసాగింది. అది కాలిబాట పక్కనే వున్న ఒక పాడుబడ్డ బావి దగ్గరకు రాగానే, మోహనకృష్ణ మురళిని ఊదడం ప్రారంభించాడు.

రాక్షసి మురళీనాదం వింటూనే, "అద్భుతం, మహాద్భుతం!" అంటూ నిద్ర మత్తుతో తూలి పాడుబడ్డబావిలో పడి పోయింది. అదే సమయంలో భటులూ, గుర్రాలూ, బోయీలూ, పల్లకీలోని యువతీ అంతా నిద్రలోకి జారుకున్నారు.

మోహనకృష్ణ మురళి ఊదడం ఆపాడు. వెంటనే అందరూ నిద్రమత్తు వదిలి కళ్ళు తెరిచారు. బావిలో పడ్డ రాక్షసి కాళ్ళు విరిగి పెద్దగా కేకలు పెట్టసాగింది. ఏమి జరిగిందో తెలియక ఆశ్చర్యపోతున్న భటులతో వాడు జరిగిందేమిటో వివరించి చెప్పి, "ఆ రాక్షసి ఇప్పట్లో బావి నుంచి బయటకు రాలేదు. ఇంతకూ మీరెవరు? ఎక్కడికి పోతున్నారు?" అని అడిగాడు.

అందుకు భటుల్లో ఒకడు, "అయ్యా, ఇదంతా మా ప్రారబ్ధం. మాది సూర్యగిరి. మా పొరుగు దేశమైన మకరగిరి రాజు మా దేశం పైకి దండెత్తాడు. యుద్ధం ప్రారంభమై నేటికి వారం రోజులైంది. మా సైనికులు



వేల సంఖ్యలో మరణించారు. మాకు ఓటమి తప్పదని తేలిపోయింది. అందువల్ల, రహస్య మార్గం గుండా, మా యువరాణిని తీసుకుని, ఇలా అరణ్యంలోకి పారిపోయి వస్తున్నాం," అన్నాడు.

వాళ్ళకు మోహనకృష్ణ తనెవరైందీ చెప్పి, "నన్ను మహారాజువద్దకు తీసుకు వెళ్లండి. ఆయనతో నేను అత్యవసరంగా యుద్ధతంత్రం గురించి మాట్లాడాలి. మన సైన్యం గెలిచే ఉపాయం నాకు తెలుసు," అన్నాడు.

యువరాణి అనుమతి తీసుకుని భటులు తమ రాజధానికేసి బయలుదేరారు. భటుల్లో ఒకడు మోహనకృష్ణను తన గుర్రం వెనక ఎక్కించుకున్నాడు. తొలిజాము గడిచేసరికి వాళ్ళు రాజధాని చేరుకున్నారు. రహస్య మార్గంగుండా అందరూ కోటలోప్రవేశించారు.



మోహనకృష్ణ తన ఎదుటికి రాగానే,రాజు వాణ్ణి ఎగాదిగా చూసి, "నువ్వు మాకేదో యుద్ధ తంత్రం చెబుతానన్నావట! ఏమిటది?" అని అడిగాడు:

రాజకుమార్తె అందచందాలకు పరవశు డైన మోహనకృష్ణకు, ఆమెను వివాహమాడా లన్న బలమైన కోరిక వున్నది. అయితే వాడా కోరికను ముందుగా బయట పెట్టడానికి సంశయించి, మహారాజుకు తనవద్దవున్న మురళి అద్భుతశక్తిని వివరించి, "మహారాజా! యుద్ధంలో నేను తప్పక విజయం సాధించి తీరుతాను. అందుకు ప్రతిఫలంగా మీరు, నా ఒకేఒక్క కోర్కెను నెరవేర్చాలి. అలా అని వాగ్దానం చెయ్యండి," అన్నాడు.

రాజు ఒక క్షణం మౌనంగావుండి, తర్వాత ప్రసన్నంగా, "మోహనకృష్ణా! నాకు శత్రురాజుపై యుద్ధంలో నువ్వు విజయం కలిగించడ మంటే– నన్నూ, నాకుటుంబాన్నీ, నా సూర్య గిరి రాజ్యాన్నీ, పౌరులనూ రక్షించినట్టు. అటువంటి నువ్వు కోరినదేదైనా ఇవ్వడానికి, మా కులదేవత ఆనగా వాగ్దానంచేస్తున్నాను!" అన్నాడు.

మర్నాడు యుద్ధం ప్రారంభం కాగానే, యుద్ధభూమిలో ఒక పక్కగా రథంమీద ఆశీనుడైవున్న మోహనకృష్ణ మహత్తుగల మురళిని ఊదడం ప్రారంభించాడు. సూర్య గిరి మహారాజు, సేనాపతి, సైనికులు మోహన కృష్ణ చెప్పిన విధంగా తమ చెవుల్లో దూది పెట్టుకున్నందున,వాళ్ళకు నిద్రరాలేదు. మకర గిరి సైనికులు, సేనాపతి, రాజు మురళీనాదా నికి పరవశించి గాఢమైన నిద్రలోకి జారు కున్నారు. ఇదే అదనుగా, వారిని సూర్యగిరి

భటులు, మోహనకృష్ణ అంతఃపురంలోని మహారాజు శయనమందిరం బయట నిల బడ్డారు. యువరాణి లోపలికివెళ్ళింది. రాజు ఆసనంలో దిగులుగా కూర్చుని వున్నాడు. కుమార్తెను చూసి ఆశ్చర్యపడుతూ ప్రశ్నించ బోయేంతలో, ఆమె అరణ్యంలో జరిగిన దంతా చెప్పి, "మోహనకృష్ణ అనే యువకుడు మనం యుద్ధంలో గెలిచేమార్గం చెబుతా నంటున్నాడు. మందిరం బయట మీ అను మతికోసం నిరీక్షిస్తున్నాడు," అన్నది.

అంతా విన్న రాజు, "ఒకసామాన్య పౌరుడు నాతో యుద్ధతంత్రం మాట్లాడడమా?అయినా, బ్రహ్మరాక్షసి బారి నుంచి నిన్నూ, భటుల్నీ రక్షించాడంటున్నావు. మహావీరుడే అయి వుండాలి. వెంటనే లోపలికి రమ్మను," అన్నాడు.

సైన్యం ఊచకోత కోసింది. సూర్యగిరి మహారాజు, మకరగిరి మహారాజును బంధించి చెరసాలలో వేయించాడు.

ఆ సాయంత్రం మోహనకృష్ణను సన్మానించేందుకు జరిగిన గొప్ప సభలో రాజుతో పాటు, ఆస్థాన పండితులూ, నగర ముఖ్యలూ, మంత్రిసామంతులూ, వాణ్ణి మహావీరుడంటూ గొప్పగా కీర్తించారు. ఒక్కసేనాపతి మాత్రం అంతాచూస్తూమౌనంగావూరుకున్నాడు. అది గమనించిన మోహనకృష్ణ కలత చెందాడు.

మహారాజు, అక్కడవున్న వారందరికీ, మోహనకృష్ణకు యుద్ధానికి ముందు తను చేసిన వాగ్దానం గురించి చెప్పి, వాడితో, "నువ్వు ఏమి కోరినా చెల్లించగలనని వాగ్దానం చేశాను. ఇప్పుడు, నీ కోరిక ఏమిటో, ఈ సభాముఖంగా వెల్లడించు," అన్నాడు.

మోహనకృష్ణ, రాజుకు నమస్కరించి, "మహారాజా, ప్రస్తుతానికి క్షమించండి. నేను కోరేదేమిటో తమకు రేపు విన్నవించగలను!" అని, తన అతిథి మందిరానికి వెళ్ళాడు.

మర్నాడు వాడు సూర్యోదయానికి ముందే నిద్రలేచి, మహత్తుగల మురళిని రెండుగా విరిచి కోట అగడ్త నీటిలో విసిరివేసి, తన గ్రామానికి ప్రయాణం కట్టాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, "రాజా, మోహనకృష్ణ అరణ్యంలో తొలిసారిగా యువరాణిని చూసినప్పుడు, ఆమె అందానికి ముగ్ధుడై, పెళ్ళంటూ చేసుకుంటే ఈమెనే చేసుకోవాలి, అనుకున్నాడు గదా! ఆ తర్వాత, యుద్ధంలో ఆమె తండ్రికి సాయపడేముందు, తనకోర్కె నొకదానిని తీర్చవలసి వుంటుందని నియమం కూడా పెట్టాడు. తీరా రాజు సభలో ఆ కోర్కె ఏదో చెప్పమన్నప్పుడు, మరుసటి రోజు చెబుతానని, కోట విడిచి తన గ్రామానికి ఎందుకు వెళ్ళాడు? అంతేకాక, వెళ్ళేముందు మహత్తుగల మురళిని విరిచి కోట అగడ్తలో



ఎందుకు పారేశాడు? కోర్కె నెరవేరనున్న ఆఖరి క్షణంలో వాడి ప్రవర్తన చూస్తూంటే- ఏదో జడబుద్ధో, మానసిక దౌర్బల్యానికో గురైయ్యాడని అనుకోవలసిందే గదా? ఈ సందేహాలకుసమాధానంతెలిసికూడా చెప్పక పోయావో, నీతల పగిలిపోతుంది!" అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మోహనకృష్ణ గురుకులంలో నేర్చిన విద్య, వాస్తవజీవిత సమస్యలను గ్రహించేందుకు పనికిరాలే దన్నది, వాడు మునుల ఆశీర్వాదం కోసం అరణ్యానికి బయలుదేరడంలోనే తెలుస్తు న్నది. అరణ్యంలో వాడికి తారసపడ్డ ముని, ఇది ఎరిగే – వాడికి మనిషికోరికలు అతడి శక్తి సామర్థ్యాలకుమించినవిగా వుండరాదని హెచ్చరించాడు. అప్పుడే వాడికి తన వద్ద వున్న మురళి మహత్తుగలదని తెలిసింది. తర్వాత, అతిసౌందర్యవతి అయిన సూర్యగిరి యువరాణిని చూడగానే, ఆమెను పెళ్ళాడా లన్న కోరిక వాడిక్కలిగింది.అయితే, శత్రు రాజును ఓడించేందుకు బయలుదేరే ముందే, ఆమె తండ్రికి తన కోర్కె ఏమిటో చెప్పి, ఆయన నుంచి వాగ్దానం పొందవచ్చు. కాని, వాడా పని చెయ్య లేదు. అంటే, ముని చేసిన హెచ్చరిక వాడు మరిచిపోలే దనుకోవాలి. నిండు సభలో వాణ్ణి అందరూ మహావీరుడని పొగుడుతూంటే, ఒక్కసేనా పతి మాత్రం మౌనంగా వూరుకున్నాడు. దానితో వాడికి తన వీరత్వం, శక్తి సామర్థ్యాలూ ఏపాటివో తెలిసి వచ్చింది. మంత్ర తంత్రాలతోనో, మహత్తులతోనో శత్రువులను నిద్రా పరవశులను చేసి, వాళ్ళ గొంతులు కోయడం వీరత్వమూ కాదు, యుద్ధ ధర్మమూ కాదని వాడు గ్రహించాడు. ఈ కారణాలవల్ల, వాడు యువరాణిని పెళ్ళాడేందుకు అనర్హుణ్ణనే కాక, మహత్తుగల మురళి మేలుకే గాక, పెద్ద కీడుకు కూడా ఎలా దారితీయగలదో ఊహించి, దాన్ని విరిచి అగడ్తలో విసిరేశాడు. అందువల్ల వాడి ప్రవర్తనలో జడత్వం, మానసిక దౌర్బల్యాల్లాంటివేమీ లేక పోగా, పరిపూర్ణమైన జ్ఞానం చోటుచేసుకున్నదను కోవాలి," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)
[ఆధారం:రాఘవరాజుపట్టాభిరామరాజు రచన]



# మలబారు తీరం

రచన: మీరా నాయర్ ▲ చిత్రాలు: గోపకుమార్




మనం మలబారు తీరం గుండా ప్రయాణం చేశామంటే, ప్రాచీన కాలంలో ముజిరిస్ అని ప్రసిద్ధి గాంచిన కొడుంగల్లూరు రేవుపట్టణం చేరుకుంటాము. దీనిని క్రాంగనూరు అని కూడా అంటారు.

పూర్వకాలంలో ఫొనీషియా, ఈజిప్టు, అరేబియా, రోము దేశాల నుంచి వ్యాపారులు ముజిరిస్ రేవుకు వచ్చి, తమ వెంట తెచ్చిన దుస్తులు, కళ్ళకాటుక, రాగి, ఇత్తడి సామానులు, మద్యం మొదలైన వాటిని విక్రయించి మిరియాలు, మలబారు కోతులు, పులులు, చిలుకలు, ఏనుగులు మొదలైన వాటిని తమ దేశాలకు కొనుక్కుని వెళ్ళేవారు!

దాదాపు రెండు వేల సంవత్సరాల క్రితం యూదులు మొట్టమొదట ఈ ప్రాంతానికి వచ్చారు. క్రీ.శ 52వ సంవత్సరంలో కొడుంగల్లూరుకు వచ్చిన సెయింట్ థామస్, కేరళ ప్రాంతంలో క్రైస్తవ మతాన్ని మొట్టమొదట ప్రచారం చేశాడు. ఇస్లాం మతాన్ని స్వీకరించిన చిట్టచివరి చేరరాజు చేరమాన్ పెరుమాళ్ క్రీ.శ 800వ సం॥లో ఇక్కడ ఒక మసీదు నిర్మించాడు. కలప చెక్కలతో, రాళ్ళతో, పెంకుల పైకప్పుతో నిర్మించబడిన నిరాడంబరమైన మసీదు ఇది. దీనికి గోపుర శిఖరం (మినార్)గాని, గుమ్మటం గాని లేదు. ఇది మెక్కాకేసి కాకుండా తూర్పుకు అభిముఖంగా ఉన్నది. కేరళ ప్రాంత ఆలయాలలోలాగే ఈ మసీదులోనూ పెద్ద కంచుదీపం వెలిగించడం విశేషం!

ఇక్కడ ఉన్న భద్రకాళి ఆలయం కారణంగా కొడుంగల్లూరు హైందవులకు కూడా ముఖ్యమైన పట్టణంగా ఉంటున్నది. ఈ ఆలయంలోని భద్రకాళి మాత కేరళ తీరాన్ని సంరక్షిస్తూ ఉంటుందని ఇక్కడి కొందరి విశ్వాసం!

1341వ సం॥లో పెరియార్ నదిలో పెల్లుబికిన భీకరమైన వరద కారణంగా కొడుంగల్లూరు రేవు ముఖద్వారం మూసుకు పోయింది. ఆ తరవాత అది వ్యాపార కార్యకలాపాలకు పనికి


మొట్టమొదటి మసీదు



రాకుండా పోయింది. పెరియార్ నది తన మార్గాన్ని మార్చుకుని కొచ్చి వద్ద సముద్రంలో కలిసి, కొత్తరేవు ఏర్పడే విధంగా చేసింది.

ప్రపంచంలోని చాలా చక్కటి రేవులలో కొచ్చిరేవు ఒకటిగా ప్రసిద్ధిగాంచింది. దీనికి 'అరేబియా సముద్రపు రాణి' అనే బిరుదనామం కూడా ఉన్నది. ఉధృతమైన రుతుపవనాల దాడి నుంచి ఇది పరిపూర్ణమైన రక్షణ కల్పిస్తుంది.

కొంత ప్రధాన భూభాగం, మరికొన్ని దీవులు కలిసి కొచ్చి ఏర్పడింది. ఆ దీవులలో - సముద్రం నుంచి పైకి లేచిన విల్లింగ్డన్ దీవి, బోల్ఘట్టీ దీవి, అక్కడక్కడ చీనావలలతో ఆకాశ రేఖను కొలిచే వైపిన్ దీవి ముఖ్యమైన మూడు దీవులు.

చైనాను పరిపాలించిన కుబ్లాయ్‌ఖాన్ ఆస్థానం నుంచి వచ్చిన వ్యాపారులు మొదట ఇక్కడ చీనావలలను ప్రవేశపెట్టారు. పొడవాటి కొయ్యకు చివర తగిలించిన పెద్ద వలను నీటిలోకి విసురుతారు. వల ఊత చుట్టూ తిరుగుతుంది. పైన వేలాడదీసే లాంతరు చేపలను ఆకర్షిస్తుంది. వలలో పడిన చేపలను బయటకు తేవడానికి, కొయ్యకు అవతలి చివర కనీసం ఆరుగురు మనుషులైనా ఉండాలి.

రేవుకు పక్కన ప్రధాన భూభాగంలో ఉన్న కొచ్చి కోటను, భారతదేశంలో యూరోపియన్లు నిర్మించిన అతి ప్రాచీనమైన కోటగా భావిస్తున్నారు.

1510వ సం॥లో పోర్చుగీసులు నిర్మించిన చర్చ్ ఆఫ్ సెయింట్ ఫ్రాన్సిస్, ఇప్పుడు మన దేశంలో ఉన్న అతి ప్రాచీనమైన యూరోపియన్ చర్చ్. 1524వ సం॥లో వాస్కోడా గామా ఇక్కడ మరణించినప్పుడు ఆయన భౌతికకాయాన్ని ఆ చర్చ్‌లో భద్రపరిచారు. చర్చ్‌కి దక్షిణం వైపుగా ఏర్పాటు చేసిన ఆయన సమాధి రాయిని ఇప్పుడు కూడా చూడవచ్చు. అయితే ఆయన భౌతిక కాయాన్ని, ఆయన కుమారుడు 1538వ సం॥లో పోర్చుగల్‌కు తీసుకుపోయాడు.

కొచ్చికోటకు దక్షిణంగా ఉన్న మాటన్ చేరి, కేరళ యూదుల నివాసస్థానం.



సెయింట్ ఫ్రాన్సిస్ చర్చ్

వారిలో చాలామంది ఇజ్రాయెల్‌కు వలస వెళ్ళడం వల్ల వారి జనాభా బాగా తగ్గి పోయింది. క్రీ.శ 4వ శతాబ్దంలో ఇక్కడ యూదుల కాలనీ ఏర్పరచబడింది. ఇక్కడ దాదాపు 430 సంవత్సరాల క్రితం 'పరదేశి సినగాగ్' అనే యూదుల మందిరం నిర్మించబడింది. 18వ శతాబ్ద మధ్యకాలంలో నిర్మించబడిన గడియార స్తంభం ఆలయంలో గంభీరంగా ఉన్నది.

ఆలయానికి సమీపంలో రెండంతస్తుల 'మాటన్ చేరి భవనం' ఉన్నది. దీని లోపలి గోడలపై రామాయణ, మహాభారత గాథలను వివరించే కుడ్యచిత్రాలు ఉన్నాయి. కొచ్చి మహారాజులు ఉపయోగించిన పల్లకీలు, రాజవస్త్రాలు, ఆభరణాలు భద్రపరచిన, చిన్న వస్తుప్రదర్శనశాల ఒకటి కోట ఆవరణలో ఉన్నది.

ఈ కోటను డచ్చివాళ్ళు నిర్మించకపోయినప్పటికీ, పూర్వ కాలంలో దీనిని డచ్ కోట అనే పిలిచేవారు. తాము నాశ పరచిన కోటకు బదులుగా పోర్చుగీసులు ఈ కోటను నిర్మించి, కొచ్చిరాజుకు శాంతికానుకగా సమర్పించారు. అయితే, ఆ తరవాత డచ్‌వాళ్ళు విలక్షణమైన తమ దేశపు శైలిలో, ఆ భవన ఉపరిభాగం ఏర్పరచి ఆ కోటను పునర్నిర్మించారు.

భవనంలోని నేల మిలమిల మెరుస్తూ నల్ల



మాటన్‌చేరి
పడవ నడిపేవాడు

చలువరాళ్ళు పొదిగినట్లు కనిపిస్తుంది. అయితే, అవి చలువరాళ్ళు కావు. కాల్చిన కొబ్బరిచిప్పలు, బొగ్గు, సున్నం, ఆకుపసరులు, గుడ్డులోని తెల్లసొన కలిపి తయారుచేసిన మిశ్రమంతో దీనిని నిర్మించారు. కేరళ ప్రాంతానికే ప్రత్యేకమైన ఈ పద్ధతి చాలాకాలం క్రితమే కనుమరుగైపోయింది. ఇవాళ ఇటువంటి నిర్మాణాలను చాలా కొద్దిచోట్ల మాత్రమే చూడగలుగుతున్నాము.

కొచ్చి నుంచి దక్షిణంగా కొల్లం వరకు వరసగా జలాశయాలు, సముద్రజల తటాకాలు చాలా ఉన్నాయి. కొచ్చి నుంచి ఆలప్పుళా వరకు గల వేంబనాడు తటాకం దాదాపు 79 చ.మై. విస్తరించి ఉన్నది. కేరళలోని అతి పెద్ద జలాశయం ఇదే.

అగస్టు-సెప్టెంబర్ నెలలలో జరిగే 'చుందన్‌వల్లమ్' అనే పడవ పందాలు చూడడానికి ఆలప్పుళా జలాశయతీరానికి ప్రజలు తండోతండాలుగా వస్తారు. పక్షిముక్కు వంటి 130 అడుగుల పొడవైన పడవలో వందకుపైగా పడవ నడిపేవాళ్ళు, లయబద్ధంగా కేకలు వేస్తూ, శరవేగంతో పడవలను నడుపుతారు. యేటా అగస్టు 15వ తేదీ స్వతంత్ర దినోత్సవం నాడు 'నెహ్రూ ట్రోఫీ బోట్ రేస్' ఘనంగా జరుపుతారు. భారత తొలిప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ మొట్టమొదటిసారిగా కేరళకు వచ్చినప్పుడు ఆలప్పుళాకు పొరుగున ఉన్న కుట్టనాడు (కేరళ ధాన్యాగారం) ప్రజలు ఆయన సమక్షంలో ఈ పోటీలు నిర్వహించారు. వాటిని చూసి పరవశం చెందిన నెహ్రూ, భద్రతా ఏర్పాట్లను కూడా లెక్కచేయకుండా, గెలుపొందిన పడవలోకి వెళ్ళి కూర్చుని ఆలప్పుళా వరకు విహారం చేశారు. నెహ్రూ ఢిల్లీకి తిరిగి వెళ్ళిన తరవాత, ఆయన తన పేరిట ఒక 'సిల్వర్ ట్రోఫీ'ని నాటి కేరళ ముఖ్యమంత్రికి పంపి– అక్కడ యేటా జరిగే పడవపందాల విజేతలకు దానిని బహూకరించమని కోరారు.



'చుందన్ వల్లమ్'
పడవ పందాలు



# పంచభూతాల సుందరకాండ

ఉప్పలపాడు జమీ ప్రాంతంలోని కొన్ని గ్రామాలు సముద్రతీరానికి దగ్గర్లో ఉండేవి. అందుచేత ఆ గ్రామాలు తరచు తుపానులకు, విపరీతమైన గాలి ఒత్తిడులకు గురవుతూండేవి. దీనికి తోడు ఒకసారి చుట్టుపక్కల గల చిట్టడవి ముట్టుకుని, గ్రామాలలో ఘోరమైన అగ్నిప్రమాదం జరిగింది. ఆకష్టం నుంచి గ్రామస్థులు ఇంకా తేరుకోకముందే గాలివానలు ప్రారంభమయ్యాయి. చివరకు ఆ గాలివానలు పెనుతుపానుగా మారడంతో ఉప్పెన వచ్చి చాలా గ్రామాలకు విపరీతమైన నష్టం కలిగించాయి.

జమీందారు అశోకవర్మ, ఆ గ్రామాలను పునర్నిర్మించి, అవసరమైన సహాయ సహకారాలతో బాటు, ఖర్చుకు వెనుకాడకుండా,భవిష్యత్తులో ప్రకృతి బీభత్సానికి ఆ గ్రామాలు తట్టుకునే విధంగా చేయాలని, గ్రామపెద్దలతో చర్చలు ప్రారంభించాడు.

ఆ సమయంలో ఆస్థాన జ్యోతిష్కుడు, జమీందారుతో, "ప్రభూ! ప్రకృతి విజృంభించినప్పుడు మనమేమీ చెయ్యలేం. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం- వీటిని పంచభూతాలంటారు. మన దేహంలో కూడా ఈ పంచభూతాలున్నాయి. ఈ పంచభూతాలలో వాయువు కుమారుడైన హనుమంతుడు, మనకు రక్షాకవచమయ్యేలా, ఈ ఉప్పెనకు జ్ఞాపకచిహ్నంగా ప్రతిష్ఠించబడాలని, నా కోరిక," అన్నాడు.

జమీందారుకు, జ్యోతిష్కుడి సూచన నచ్చింది. ఆయన వెంటనే హనుమంతుడి విగ్రహ స్థాపనకు కావలసిన స్థలాన్ని ఎంపిక చేయించాడు. అంతే కాక, ఆ స్థలంలో ఫల వృక్షాలు, పూలమొక్కలు మొదలైనవి నాటి, ఆ ప్రదేశాన్ని సుందరవనంగా రూపొందించాలని ఆదేశించాడు. అతి కొద్దికాలంలోనే, జమీందారు ఎంపిక చేసిన స్థలం సుందర

జె. ఉదయనాగశిరీష



వనంగా రూపుదాల్చింది. చూపరులను ఇట్టే ఆకట్టుకునేలా ఆ వనంలో వృక్షసంపదతో పాటు, నీటి జలధారలు కూడా వెలిశాయి. ప్రకృతి బీభత్సానికి జ్ఞాపకచిహ్నంగా రూపు దిద్దుకున్న ఆ వనంలో, హనుమంతుడి విగ్రహం ప్రతిష్ఠించడమే మిగిలింది.

కొద్దివారాల్లో విగ్రహ ప్రతిష్ఠాపనముహూర్తం రానేవచ్చింది. జమీందారుతో సహా ప్రజలు అధిక సంఖ్యలో తరలివచ్చారు. సుందర మైన ఆ వనంలో నిలువెత్తు ఆంజనేయ విగ్రహం ప్రతిష్ఠించబడింది.

హనుమంతుడి మీద పాటలు, పద్యాలు రచించి, గాయకులు, కవులు వినిపించారు. సామాన్యజనం భజనలు చేశారు. కార్య క్రమంలో భాగంగా, ఒకరోజు జమీందారు, "ఈ రోజు సుందరకాండ పారాయణం చేయిద్దాం. వీలయినంత ఎక్కువమందితమ తమ రామాయణాలతో రండి!" అని కోరాడు.

ఆ సమయంలో ఒక వ్యక్తి బిగ్గరగా రోదిస్తూ, "జరిగేది జరగక మానదు. భగవం తుడు దుర్మార్గుడు. సుందరకాండ చదివి నంత మాత్రాన హనుమంతుడు ప్రసన్నమవు తాడనుకోవడం పొరబాటు. నేను రామాయ ణంలోని సుందరకాండను పద్యరూపంలో రచించాను. అయితే, ఆ మధ్య వచ్చినఉప్పె నలో దానితో పాటు ఇల్లూ వాకిలీ సర్వం కోల్పోయాను," అంటూ కేకలు వేయసాగాడు.

జమీందారు అతణ్ణి దగ్గరకు పిలిపించి, "ప్రకృతి పంచభూతాల కలయిక. ఆ పంచ భూతాలలో ఒకటైన జలప్రళయం ముందు మనమేపాటి! నిజంగా మీరు భక్తిగా సుందర కాండ రచించి వుంటే, వ్యక్తిగతమైన నష్టంగా దీన్ని భావించ కండి. కవులకు లోకమే కుటుంబమంటారు. మీరు సుందరకాండ తిరిగి రాయడానికి సకల సదుపాయాలూ కల్పిస్తాను. పంచభూతాలలో ఒకటైన, ఆ వాయుపుత్రుడిని నాకు సంతృప్తి కలిగేలా కీర్తించండి!" అని కోరాడు.

జమీందారు ఇలా అనగానే, ఆ వ్యక్తి సిగ్గుపడుతూ, "ప్రభూ! నేనొక కవినన్నమాట మరిచిపోయాను.సుందరకాండ చదివితే కష్టాలు తొలగిపోయి కీర్తి ప్రతిష్ఠలు లభ్య మవుతాయంటారు. నేను సుందరకాండ రచన చేసినా, ఉప్పెన బీభత్సంలో, నా రచ నతో సహా సర్వం కోల్పోయేసరికి భగవన్నింద చేశాను. నన్ను క్షమించండి! మీరు నిర్మించిన ఈ వనం మధువనానికి సరిపోవాలి. పంచ భూతాలలో నాల్గవ భూతానికి పుట్టిన

సుందరరూపం -ఐదవ భూతానికి, రెండవ భూతానికి మధ్యలో దూరాన్ని దాటి, మొదటి భూతం సంతానానికి ధైర్యం చెప్పి, మూడవ భూతంతో స్నేహం చేసి అలజడి సృష్టించి, తిరిగి ఐదవభూతం, రెండవ భూతం మధ్య గల దూరాన్ని దాటి, మొదటి భూతం సంతానానికి ఆనందం కలిగేలా -ఈ మధు వనంలో కొలువుండి, మీకు ప్రసన్నుడగుగాక!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే ఆస్థానకవి లేచి, "ఆహా! కవిరాజా, అద్భుతం! తమరు మా జమీందారీ ప్రాంతం వారవడం, మాకు గర్వకారణం. ప్రభూ! పంచభూతాల ప్రసక్తితో సుందరకాండ వినిపించిన, ఈ కవి వాక్చాతుర్యం కొనియాడదగినది," అన్నాడు.

తర్వాత ఆయన, అక్కడ వున్న జనం కేసి తిరిగి ఇలా అర్థం చెప్పాడు: "పంచ భూతాలలో భూమి మొదటిది. రెండవది నీరు. మూడవది అగ్ని. నాలుగు వాయువు. ఐదవది ఆకాశం. నాల్గవ భూతమైన వాయువు కుమారుడు ఆంజనేయుడు రెండు, ఐదు భూతాల మధ్య- అంటే సముద్రపు నీరు, ఆకాశానికి మధ్య ఎగురుకుంటూ లంక చేరుకుని, మొదటి భూతం సంతానం అంటే; భూపుత్రి సీతను ఓదార్చి, మూడవ భూతం అంటే; అగ్ని సహాయంతో లంక కాల్చి, మళ్ళీ భూమికి- ఆకాశం మధ్యగా ఎగురుకుంటూ వచ్చి, వాలిదైన మధువనం లాంటి, ఈ మీ వనంలో కొలువుంటాడు, మీకు ప్రసన్నుడవుతాడు! అని సుందరకాండ ప్రశంస చేశాడు!"

అందరూ కరతాళ ధ్వనులు చేశారు. జమీందారు ఆ వ్యక్తిని సమీపించి, "మహాకవీ! ఆ మారుతే స్వయంగా మీ నోట సుందర కాండ ప్రశంస చేయించి, తిరిగి రాయమని మీకు కర్తవ్యం బోధించాడు. రాజులు, రాజ్యాలు పోయినా కవులు చిరస్మరణీయులుగా వుండిపోతారు. మీ కావ్యరచనతో పాటు, నా పేరు కూడా చిరస్థాయి అవుతుంది. ఈనాటి నుంచి మిమ్మల్ని మారుతికవిగా పిలుస్తాం. సుందరకాండ రచించి మాకు కూడా యశస్సు తెండి," అని కోరాడు.

మారుతికవి, ఆ వనంలో పంచభూతాల సుందరకాండ రచించి ప్రజల గౌరవాభిమానాలతో పాటు, జమీందారు మన్ననలు కూడా పొందాడు.



# పరోపకారం!

హేలాపురిలోని, ఒక ప్రసిద్ధమైన గురుకులంలో విద్యనభ్యసించడానికి, దూరప్రాంతాల నుంచి కూడా విద్యార్థులు వస్తూండేవాళ్ళు. అక్కడ శ్రద్ధగా విద్యనభ్యసించిన వాళ్ళల్లో కొందరికైనా రాజాస్థానంలో ఉద్యోగం దొరుకుతుందన్న ప్రతీతి ఉండేది.

ఒక రోజున గురువు విద్యానందుడు పరోపకారం ఎంత పుణ్యమో విద్యార్థులకు వివరిస్తూ, "ఉదాహరణకు, కొందరు వృద్ధులు వచ్చేపోయే వాహనాల భయం కారణంగా బాట దాటలేక, దిక్కులు చూస్తూ నిలబడి వుంటారు. అలాంటివారిని బాట దాటించడం ఎంతో పుణ్యకార్యమవుతుంది," అని చెప్పాడు.

ఆ మర్నాడు నలుగురు విద్యార్థులు గురుకులానికి ఆలస్యంగా వచ్చారు. గురువు ఇంత ఆలస్యమయిందేమని వాళ్ళను ప్రశ్నించాడు.

దానికి వాళ్ళు, "గురువర్యా! మేము ఇక్కడికి వస్తుండగా, ఒక వృద్ధుడు బాట పక్క నిలబడివున్నాడు. మేం నలుగురం కలిసి అతణ్ణి బాట దాటించాము," అన్నారు.

"అలాగా! చాలా సంతోషం. ఆ వృద్ధుణ్ణి బాట దాటించడానికి ఒక్కరు సరిపోతారు కదా? నలుగురి అవసరం ఎలా కలిగింది?" అని ప్రశ్నించాడు గురువు.

"ఆ ముసలాయన బాటకు ఆ పక్కకు రానని పేచీ పెట్టాడు. ఇది పనికాదని నలుగురం కలిసి అతణ్ణి ఎత్తుకుని బాట దాటించాము," అన్నారు విద్యార్థులు.

ఇది విన్న గురువు నిర్ఘాంతపోయాడు.

— కోనేనాగవెంకటఆంజనేయులు



చందమామ

# బంగారు గడియలు

## అతిపెద్ద వేట!

చరిత్ర పూర్వయుగపు మనిషి గ్రూ- తన రాతి ఆయుధాన్ని బలంగా విసిరాడు.

తప్పిపోయింది..

ఇప్పుడు,నేను వదలను

ఖ్రీ....!

ఈ కథలోని అసలు పొరబాటు ఏమిటి?



# బంగారు గడియలు ప్రశ్నావళి



**1** స్కాట్‌లాండ్‌లోని ఒక తటాకంలో నివసిస్తూన్నదని భావించబడుతున్న ఒక వింత భీకర మృగాన్ని చూడాలని అక్కడి ప్రజలు వందలాది సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నారు. ఆ భీకరమృగం పేరేమిటి?

**2** టిబెటన్లూ, హిమాలయ అధిరోహకులు కొందరూ– మంచు కప్పిన కొండల మీద సగం మనిషి– సగం జంతువు ఆకారం గల వింత ప్రాణిని చూసినట్టు చెప్పారు. ఆ ప్రాణి పేరేమిటి?





**3** ఓడలు, విమానాలు అట్లాంటిక్ మహాసముద్రంలోని ఒక ప్రాంతం దరిదాపులకు వెళ్ళకుండా జాగ్రత్తపడతాయి. ఆ ప్రాంతం మీదుగా వెళ్ళిన ఎన్నో ఓడలు, విమానాలు ఆచూకీ తెలియకపోవడమే దీనికి కారణం. ఆ ప్రాంతం పేరేమిటి?

**4** పక్షుల అస్థిపంజరాలు మరీ తేలికగా ఉండడానికి కారణం ఏమిటి?



**5** మనుషులకు మెడభాగంలో ఏడు ఎముకలు ఉంటాయి. జిరాఫీకి ఎన్ని ఉంటాయి?



**6** ఎడ్గార్ వాలెస్ రచించిన ఒక నవల ఆధారంగా 1933వ సం॥లో నిర్మించిన సినిమాలో భయంకరాకారుడైన ఒక గెరిల్లా న్యూయార్క్ నగర వీధులలో పరుగులు తీస్తాడు. ఆ సినిమా పేరేమిటి?



**7** అతిపెద్ద గుడ్డు పెట్టే పక్షి ఏది?





**8** సొరచేపలు సదా తిరుగుతూ ఉంటాయి? మరి అవి తిరగడం ఎప్పుడు ఆపుతాయో తెలుసా?

# డైనోజార్ కట్-అవుట్ తయారుచేసుకోండి

ఈ డైనోజార్ కట్-అవుట్‌ను ఒక దృఢమైన అట్టమీద పెద్దధి చేసుకోండి. (ఎన్‌లార్జ్ చేసిన ఫోటో కాపీ మీద ట్రేస్ చేసుకోవచ్చు). చుక్కల గీతలను, తెగిన గీతలను ట్రేస్ చేసుకోండి. డిజైన్ను కత్తిరించి, రంగులు వేయండి. ఇప్పుడు మీ డిజైన్ మడవడానికి సిద్ధంగా ఉంటుంది. మడవడానికి ముందు చుక్కల గీతల మీద కత్తెర మొనతో కొద్దిగా గాడి చేసుకోండి. చుక్కల గీతల (....) శరీర భాగాన్ని కిందికి మడుచుకోండి. అలా మడిచిన తరవాత కూడా గీతలు కనిపిస్తాయి. శరీర భాగాన్ని,తెగిన గీతల (.....) మీదుగా పైకి మడుచుకోండి. ఇప్పుడు గీతలు కనిపించవు. తోక రెండు ముక్కలను ఒకటిగా అతికించుకోండి. ఎరుపురంగులో చూపిన భాగాలను, పటంలో చూపిన విధంగా అతికించుకోండి.






మైత్రేయుడు వెళ్ళిపోయాక ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కిమ్మీర వధ గురించి చెప్ప మన్నాడు. విదురుడుఆవృత్తాంతం ఈ విధంగా చెప్పాడు:

అరణ్యవాసానికి బయలుదేరిన పాండవులు మూడు రోజులు ప్రయాణం చేసి, అర్ధరాత్రి వేళ కిమ్మీరవనంలో నుంచి పోతూ ఉండగా ఒక భయంకర రాక్షసుడు మెరిసే గుడ్లతో, నోరు తెరుచుకుని, చేతులు చాచి, వారి దారికి అడ్డుగా నిలిచి కనిపించాడు. వాడి ఎర్రని కనుగుడ్లూ, తెల్లని కోరపళ్ళూ, నెత్తిమీద బంగారం రంగులో నిక్కబొడుచుకుని ఉన్న వెంట్రుకలూ, నల్లని శరీరమూ అతిభయంకరంగా ఉన్నాయి. వాడి రంకెలకు అరణ్యమృగాలు పారిపోతున్నాయి.వాడిచేతిలో మండుతున్న కొరవి ఉన్నది.

పాండవులూ, వారివెంట ఉన్న ద్రౌపదీ, బ్రాహ్మణ బృందమూ ఆ రాక్షసుణ్ణి చూశారు. ద్రౌపది వాణ్ణిచూసి భయంతో కళ్ళు మూసుకున్నది. పాండవులు ఆమెకు ధైర్యం చెప్ప సాగారు. ధౌమ్యుడు రాక్షస వినాశన మంత్రాలు చదవనారంభించాడు.

ధర్మరాజు ఆ రాక్షసుడితో, "నువ్వు ఎవడవు? ఈ వనంలో ఎందుకున్నావు?" అన్నాడు.

దానికి రాక్షసుడు, "నేను బకాసురుడి తమ్ముణ్ణి. నా పేరు కిమ్మీరుడు. కామ్యక వనమంతా నేను యధేచ్ఛగా సంచరిస్తూ ఉంటాను. మనుషులను చంపి తింటాను. అందుచేత మనుషులెవరూ ఈ ప్రాంతాలకు రారు. మీరిక్కడికి ఎందుకు వచ్చారు? వచ్చారు గనుక మిమ్మల్ని అందరినీ ఇప్పుడే తినేస్తాను," అన్నాడు.

ధర్మరాజు వాడితో, "మేము పాండవులం. నా పేరు ధర్మరాజు. వీళ్ళు నలుగురూ నా తమ్ములు. ఒక నియమానికి లోబడి మేము

28. కిమ్మీర వధ



వనవాసం చెయ్యడానికి బయలుదేరి వస్తున్నాం," అన్నాడు.

కిమ్మీరుడిది విని, "ఎట్లాగూ? ఇతడేనా భీముడు? ఈ భీముణ్ణి చంపాలని చాలా కాలంగా ఎదురు చూస్తున్నాను. ఇవాళ నా పంట పండింది. ఇతడు నా అన్న బకుణ్ణి చంపాడు. నా స్నేహితుడైన హిడింబుణ్ణి చంపి, వాడి చెల్లెలు హిడింబిని కాజేశాడు. ఈ దుర్మార్గుడు బుద్ధితక్కువతనం చేత ఈ మహారణ్యంలోకి వచ్చి, నాకు దొరికాడు. ఈతని నెత్తురు బక హిడింబులకు తర్పణం చేస్తాను. మీ అందరి ఎదుటనే ఈ దుర్మార్గుడి నెత్తురు తాగి, మాంసం తిని మా జాతి పగ తీర్చుకుంటాను," అన్నాడు.

ధర్మరాజుకు చాలా కోపం వచ్చి, "ఛీ, నోరు మూసుకో!" అన్నాడు. భీముడు ఒక చెట్టు పెరికి, కిమ్మీరుడి మీద కలియ బడటానికి సిద్ధమయ్యాడు. అర్జునుడు గాండీవానికి తాడు తగిలించి మీటి, బాణాలు సవరించాడు. భీముడు అర్జునుణ్ణి వారిస్తూ, "నువ్వు ఆగు. ఈదుర్మార్గుణ్ణి ఇప్పుడే యమపురానికి పంపేస్తాను," అంటూ తన చేతిలో ఉన్న చెట్టు కిమ్మీరుడి మీదికి విసిరాడు.

కిమ్మీరుడు ఆ దెబ్బకు అలిగి, తన చేతిలో ఉన్న కొరవి భీముడిపై విసిరాడు. భీముడు దాన్ని ఎడమకాలితో నలిపేశాడు. తరవాత ఆ ఇద్దరూ చెరొక చెట్టూ పీకి కొట్లాడనారంభించారు. తరవాత రాళ్ళతో ఒకరినొకరు కొట్టుకున్నారు. చివరకు కలియబడ్డారు. ఒకరినొకరు రక్కుకున్నారు, చాలా దారుణంగా పోట్లాడారు. చివరకు రాక్షసుడి బలం తగ్గిపోవడం గమనించి భీముడు వాణ్ణి చంకలో ఇరికించుకుని గిరగిరా తిప్పి, కిందపడేసి నడుము మీద కాలువేసి తొక్కి వాడి తలా, చేతులూ పట్టుకుని విరిచి చంపాడు. వాడు అతిదారుణంగా రంకెలు పెడుతూ చచ్చాడు. భీముడు వాడి శవాన్ని దూరంగా పారేశాడు. ఆ అరణ్యానికి వాడి పీడ లేకుండా చేశాడు. తరవాత ద్రౌపదీ, ధౌమ్యుడూ భీముణ్ణి ఎంతగానో అభినందించారు.

కిమ్మీరవధ ఇలా జరిగిందని విదురుడు చెప్పేసరికి ధృతరాష్ట్రుడు నిట్టూర్పులు విడుస్తూ, తల వంచుకుని విచారంలో మునిగిపోయాడు.

పాండవులు అధర్మమైన జూదంలో ఓడి అరణ్యాలలో ఉన్న మాట తెలిసి, యాదవులూ, పాంచాలులూ వారిని చూడ వచ్చారు.

యాదవులను వెంటబెట్టుకుని వచ్చిన కృష్ణుడు కంటతడి పెట్టుకుని, క్రోధావేశంతో, "పాపాత్ములైన దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణుల రక్తంతో భూమి తడవాలి. అటువంటి అధర్మపరులను చంపడం ఉత్తమ ధర్మం. వారందరినీ ఒక్కపెట్టున చంపి, ధర్మరాజుకు రాజ్యాభిషేకం చేద్దాం," అన్నాడు.

ద్రౌపది తనవాళ్ళయిన ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాలులను వెంటబెట్టుకుని కృష్ణుడి వద్దకు వచ్చి, తనకు కౌరవులు చేసిన పరాభవాలను చెప్పుకుని కుమిలి కుమిలి ఏడ్చింది.

కృష్ణుడు ఆమెను ఓదార్చుతూ, "ద్రౌపదీ, నిన్ను అవమానించిన ఆ దుర్మార్గులునశించి తీరుతారు. వారి భార్యలు నీ కన్న మరింతగా దుఃఖసముద్రంలో మునుగుతారు. త్వరలోనే పాండవులు రాజాధిరాజులవుతారు. నువ్వు వారి పట్టమహిషివి అవుతావు," అన్నాడు.

ద్రౌపదిని అర్జునుడూ, ధృష్టద్యుమ్నుడూ కూడా ఓదార్చారు.

తరవాత కృష్ణుడు ధర్మరాజుతో, "ఆ సమయంలో నేను ద్వారకలో ఉండి నట్టయితే, పిలవని పేరంటంగానైనా మీరా డిన జూదం చూడటానికి వచ్చి, సహాయ పడి ఉండేవాణ్ణి. అసలు నేనుంటే ఆ జూదం జరిగేది కాదు. దుర్యోధనుడు జూదం మానకపోతే అక్కడే వాడికి శాస్తి చేసి ఉండేవాణ్ణి. నేను ద్వారకకు తిరిగి రాగానే యుయుధానుడు నాకు మీ విషయాలన్నీ చెప్పాడు. వెంటనే మిమ్మల్ని చూడటానికి బయలుదేరి వచ్చాను," అన్నాడు.

"ఆ రోజులలో నువ్వు ద్వారకలో ఎందుకు లేవు? ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగాడు ధర్మరాజు.

"రాజసూయయాగ మప్పుడు శిశుపాలుణ్ణి నేను చంపానని నామీద అతని తమ్ముడు





సాళ్వుడు పగబట్టాడు. వాడి దురాగతాలు భరించలేక వాడుండే సౌభనగరం మీదికి యుద్ధానికి వెళ్ళాను," అని కృష్ణుడు ఆ కథ అంతా ఈ విధంగా చెప్పాడు:

కృష్ణుడు రాజసూయ యాగమప్పుడు శిశుపాలుణ్ణి చంపాడన్నది సాళ్వుడికి తెలియగానే, అతను సౌభమనే విమానం మీద ద్వారక పైకి వచ్చి దాడి చేశాడు. అప్పుడు కృష్ణుడింకా ఇంద్రప్రస్థంలోనే ఉన్నాడు. అందుచేత, తమ నగరాన్ని ముట్టడించిన సాళ్వుడితో యుద్ధం చెయ్యడానికి ఉగ్రసేనుడు సన్నాహాలు చేసి, దుర్గ రక్షణకు గాను శూరులను నియమించి, యుద్ధం చెయ్యడానికి గదుడూ, సాంబుడూ మొదలైన వారిని పంపాడు. యుద్ధం జరిగింది. అందులో ప్రద్యుమ్నుడు గొప్ప పరాక్రమం చూపి, సాళ్వుడి సేనలను చిందర వందర చేశాడు.

ఇంతలో కృష్ణుడు ఇంద్రప్రస్థం నుంచి ద్వారకకు తిరిగి వచ్చాడు. జరిగిన సంగతి విని అతను, సాళ్వుణ్ణి చంపిగాని ద్వారకలో అడుగుపెట్టనని శపథం చేసి, యుద్ధసన్నద్ధుడై బయలుదేరాడు. ఈ సంగతి తెలిసి సాళ్వుడు తన సౌభ విమానం మీద సముద్రతీరానికి పారిపోయాడు. కృష్ణుడు వాణ్ణి తరుముతూ వెళ్ళాడు.

సాళ్వుడు తన విమానాన్ని సముద్రానికి ఎగువగా ఆకాశంలో నిలిపి, నవ్వుతూ కృష్ణుణ్ణి యుద్ధానికి ఆహ్వానించాడు.

కృష్ణుడు సాళ్వుడి పైన వేసిన బాణం ఒక్కటీ తగల లేదు, కాని వాడు వేసే బాణాలు కృష్ణుడి సేన మీద వర్షం లాగా వచ్చి పడ్డాయి. ఇది చూసి విమానంలో ఉన్న సాళ్వుడి అనుచరులు చప్పట్లు కొట్టారు. ఆ ధ్వనిని బట్టి కృష్ణుడు బాణాలు వేసి కొందరిని చంపగలిగాడు. కాని విమానం సహాయంతో సాళ్వుడు మాయాయుద్ధం జయప్రదంగా సాగించాడు. కృష్ణుడి సారథి అయిన దారుకుడికి కూడా తమకు విజయం కలగదని సందేహం కలిగింది.

ఈ దారుణ పరిస్థితిలో కృష్ణుడున్నచోటికి కృతవర్మ పంపిన దూత ఒకడు వచ్చి,సాళ్వుడు అదృశ్యంగా ద్వారక ప్రవేశించి, కృష్ణుడి తండ్రి అయిన వసుదేవుణ్ణి చంపేసినట్టు వార్త తెచ్చాడు. కృష్ణుడీ వార్తను ఎలా నమ్మటమా అని ఆలోచిస్తూ ఉండగా వసుదేవుడి శవం ఆకాశం నుంచి కింద పడటం అతనికి కనిపించింది. వెంటనే కృష్ణుడు నీరసించి,

రథంలో ఒక పక్కకు ఒరిగి పోయాడు. అతని చేతినుంచి విల్లు జారి కింద పడిపోయింది. కృష్ణుడి సేనలో భీతితో హాహాకారాలు పుట్టాయి.

ఇదంతా సాళ్వుడి మాయ అని కృష్ణుడు గ్రహించటానికి కొంతసేపు పట్టింది. సాళ్వుడి మాయలన్నీ అర్థం చేసుకుంటూ, చిట్ట చివరకు తన చక్రాయుధం ప్రయోగించి, సాళ్వుడి విమానాన్నీ, సాళ్వుణ్ణీ, అందులో ఉన్న వారందరినీ నాశనం చేశాడు. కృష్ణుడు ఈ యుద్ధంలో జయించి, ద్వారకకు తిరిగి వచ్చేసరికి, పాండవులు అరణ్యాలకు వెళ్ళిన వార్త తెలిసింది. వెంటనే అతను పాండవులను చూడవచ్చాడు.



పాండవులను చూడవచ్చిన యాదవులూ, పాంచాలులూ, కైకేయులూ తిరిగి వెళ్ళి పోయారు.

పాండవులు వనవాసం చేస్తూ, రాగల యుద్ధం గురించి ఆలోచనలు చేశారు. ఒకనాడు ధర్మరాజు అర్జునుడితో, "అర్జునా, పూర్వం వృత్రాసురుడి దెబ్బకు తట్టుకోలేక దేవతలందరూ తమ తమ అస్త్రాలను ఇంద్రుడి వద్ద ఉంచారు. ప్రతిస్మృతి అనే విద్యను వ్యాసమహాముని నాకు చెప్పాడు. నువ్వు దాని ద్వారా ఇంద్రుణ్ణి మెప్పించి ఆ అస్త్రాలను సంపాదించుకురా. రేపు దుర్యోధనుడి పక్షాన భీష్మ, ద్రోణ, కర్ణాదులు నిలిచి యుద్ధం చేస్తారు. వారిని గెలవడం ఎలా అని నేను ఆలోచిస్తూ వుంటే వ్యాసమహాముని ప్రత్యక్షమై నాకు ప్రతిస్మృతి అనే విద్య ప్రసాదించి, దానిని నీకివ్వమన్నాడు. నా నుంచి దాన్ని నువ్వు తీసుకుని పునశ్చరణ చేసి, ఇవాళే ఉత్తరంగా బయలుదేరి వెళ్ళు," అన్నాడు.

అర్జునుడు ధర్మరాజు నుంచి ప్రతిస్మృతి గ్రహించి, అగ్నిని ఆరాధించి ప్రదక్షిణం చేసి, కవచమూ, గాండీవమూ, అక్షయతూణీరాలూ ధరించి, ధౌమ్యుడికీ, ధర్మరాజుకూ ప్రదక్షిణ నమస్కారాలు చేసి, సెలవు పుచ్చుకుని బయలుదేరాడు.

ద్రౌపది అతన్ని సాగనంపటానికి కొంత దూరం వెంటవచ్చి, "నువ్వు వెళ్ళేపని సఫలం అగుగాక. నువ్వులేని లోటు మమ్మల్నందరినీ బాధిస్తుంది. నీ క్షేమం కోరుతూ నీ రాక కోసం ఎదురుచూస్తూ ఉంటాం. మా కష్ట సుఖాలన్నీ నీ మీదే ఆధారపడి ఉన్నాయి. విఘ్నాలు లేకుండా వెళ్ళినపని చేసుకురా," అన్నది.

అర్జునుడు అరణ్యాల వెంబడి ప్రయాణం చేస్తూ దారిలో తగిలిన హిమాలయాన్నీ, గంధమాదన పర్వతాన్నీ దాటి, ఇంద్రకీలాద్రి చేరాడు. అతను అక్కడినుంచి అతివేగంగా ముందుకు సాగి పోతూండగా, "ఆగు!" అన్నమాట వినిపించింది.

ఆ నిర్జన ప్రదేశంలో ఎవరు మాట్లాడారా అని అర్జునుడు చుట్టూ కలియజూసేసరికి, ఒక చెట్టు నీడన ఒక తపస్వి కనిపించాడు. ఆయన పింగళవర్ణదేహం కలిగి, బక్కచిక్కి కూడా బ్రహ్మతేజస్సుతో వెలుగుతున్నాడు.

అర్జునుడు ఆయన వద్దకు వెళ్ళి నిల బడ్డాడు.

"నాయనా, నువ్వెవరు? యుద్ధానికి వెళ్ళేవాడిలాగా కవచమూ, ఆయుధాలూ ధరించి ఈ వనంలో ఎందుకు తిరుగుతు న్నావు? ఇక్కడ గొప్ప గొప్ప తపస్వులు, ఇంద్రియాలను జయించినవారు ఉంటారు. ఇలాంటి చోట ఈ ఆయుధాలెందుకు? అందుచేత వీటిని అవతల పారెయ్యి," అన్నాడు ఆ తపస్వి.

అర్జునుడు అందుకు సమ్మతించలేదు. తపస్వి ఎంత చెప్పి కూడా ప్రయోజనం లేకపోయింది. అప్పుడా తపస్వి, "నాయనా, నీ పట్టుదలకు సంతోషించాను. నేను ఇంద్రుణ్ణి. ఏం వరం కావాలో కోరుకో!" అన్నాడు.

అర్జునుడు ఇంద్రుడికి నమస్కారం చేసి, "దేవా, నాకు దివ్యాస్త్రాలన్నీ ప్రసా దించు," అన్నాడు.

దానికి ఇంద్రుడు, "వెర్రివాడా, నీ కిక అస్త్రాలెందుకు? పుణ్యలోకాలే ఇస్తాను; హాయిగా అక్కడ ఇంద్రభోగాలతో సుఖించు," అన్నాడు.

"మా అన్నలూ, తమ్ములూ అరణ్యా లలో పడరాని పాట్లు పడుతూ ఉంటే, నేనొక్కణ్ణీ భోగాలతో సుఖించనా? అది నా వల్ల కాదు. నేను క్షత్రియుణ్ణి. చచ్చిన తర వాత కూడా నా కీర్తి నిలిచి ఉండాలి.అంతే గానీ సుఖం కోసం అపకీర్తిపాలు కాలేను," అన్నాడు అర్జునుడు.

ఇంద్రుడు అర్జునుడి మంచితనాన్ని మెచ్చుకుని, "నాయనా, నీ కోరిక నెరవేరా లంటే నీకు ముందు శివుడి దర్శనం కావాలి. వెళ్ళి ఆయన దర్శనం చేసుకో," అని చెప్పి అంతర్ధానమయ్యాడు.



# అందమైన అనుభూతి

మారన్న గుడ్డివాడు. భార్యపోవడంతో అతడి సంరక్షణ ముగ్గురు కోడళ్ళమీదా పడింది. ఒకసారి వాళ్ళింటికి చిత్రకారుడొకాయన వచ్చాడు. అందమైన ఒకే ఒక స్త్రీ బొమ్మ గీయాలని వెతుకుతూ వచ్చిన ఆ చిత్రకారుడికి, మారన్న ముగ్గురుకోడళ్ళూ ఒకరిని మించి ఒకరు అద్భుత సౌందర్యవతులు కావడంతో ఏం చేయాలో తెలియక వారినే అడిగాడు. వాళ్ళు మొహమాట పడ్డారు. భర్తల నడిగితే ఎవరి భార్యల పేర్లు వాళ్ళు చెప్పారు. చుట్టుపక్కల వాళ్ళనడిగితే, అందరూ తలొక రకంగానూ చెప్పారు.

ఎటూ తేల్చుకోలేక సతమతమవుతున్న చిత్రకారుడికి, ఆ రాత్రి మారన్న పక్కన మంచం వేశారు. మాటల సందర్భంలో అతడి సమస్య తెలుసుకుని, "దీనికింత ఆలోచనా? నా రెండోకోడల్నిమించిన అందగత్తె ఈ ప్రపంచంలో వుంటుందనుకోను," అన్నాడు మారన్న.

మర్నాడు నిద్రలేస్తూనే చిత్రకారుడు, రెండో కోడల్ని బొమ్మగీయడానికి ఎన్నుకున్నాడు. అందుకు మారన్న కారణమని గ్రహించిన వారందరూ, "ఇంత మంది చెబితే నచ్చలేదు. గుడ్డివాడి మీద గురి కుదిరిందా?" అంటూ చిత్రకారుణ్ణి గేలిచేశారు.

"కళ్ళతో కొలిచే అందం కంటే, అనుభూతితో కొలిచే అందం గొప్పది. ఆ అవకాశం గుడ్డివాడి కున్నంతగా ఇంకెవరికీ లేదు. ఆత్మసౌందర్యాన్ని, బాహ్యసౌందర్యం నుంచి వేరు చేసి దర్శించ గలిగి నది గుడ్డివాడు మాత్రమే! బాహ్యసౌందర్యంలో సరిసమానులైన ముగ్గురు కోడళ్ళలో, రెండో కోడలికి ఆత్మ సౌందర్యం జతపడ్డంతో ఆధిక్యత వచ్చింది!" అన్నాడు చిత్రకారుడు.

ఇది విన్న మిగతా కోడళ్ళిద్దరూ, రెండో కోడలికేసి చిరునవ్వు నవ్వుతూ చూశారు. –శ్రీరామకమల్



చందమామ అనుబంధం – 95

# మనదేశపు చెట్లు

## దిరిసెన చెట్టు

మన ప్రాచీన కవులకు చాలా ప్రీతి పాత్రమైనది దిరిసెన చెట్టు. కణ్వముని ఆశ్రమంలోని శకుంతల దిరిసెన పువ్వును కురులలో ధరించేదని మహాకవి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతల నాటకంలో రాశాడు. తులసీదాసు తన రామచరిత్‌మానస్‌లో, శ్రీరామచంద్రుడి మనసు శిరీష కుసుమ కోమలమని అభివర్ణించాడు. మనదేశంలో చాలా యేళ్ళు గడిపిన రుడ్యార్డ్ కిప్లింగ్ 'దిరిసెన కొమ్మపై నుంచి కోయిల పాడే పాటను' కొనియాడాడు.

ఆంగ్లంలో దిరిసెన చెట్టును 'పేరట్ ట్రీ' 'విమన్స్ టంగ్' 'ఈస్ట్ ఇండియన్ వాల్‌నట్' అని రకరకాలుగా పిలుస్తారు.



దిరిసెన చెట్లు అడవులలో చాలా ఎత్తుకు పెరుగుతాయి. ఇవి మన దేశమంతటా విస్తరించి ఉన్నప్పటికీ దిగువ హిమాలయ ప్రాంతం, పశ్చిమ బెంగాల్, చోటా నాగపూర్, అండమాన్ దీవులలో ఎక్కువగా కనిపిస్తాయి. తడిగా ఉన్న నేలలో ఇవి బాగా పెరుగుతాయి. వీటిని బాటలకు ఇరువైపులా అలంకార వృక్షాలుగా పెంచుతారు. వీటి వేళ్ళు సన్నగానూ,పొట్టిగానూ ఉండడం వల్ల ఈ చెట్లు తుపాను ధాటికి తట్టుకోవడం కష్టం.

మార్చ్ - ఏప్రిల్ నెలల మధ్య దిరిసెన పూతకు వస్తుంది. పువ్వులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. లేత పచ్చ – తెలుపురంగులో ఉంటాయి. ఇంచుమించు మల్లెపువ్వులాంటి వాసన వీస్తాయి. ఆకులు చిన్నవిగా ఉంటాయి. అక్టోబర్ – నవంబర్ నెలల మధ్య ఆకులు పూర్తిగా రాలిపోయి దాదాపు రెండు నెలలు చెట్లు మోడుగా కనిపిస్తాయి. ఏప్రిల్ నెలలో మళ్ళీ చిగురిస్తాయి. ఆగస్టు-సెప్టెంబర్ నెలలలో కాయలు ముదిరి పండుతాయి.

దిరిసెన కలప దృఢమైనది. కాబట్టి బండి చక్రాలకూ, ఇతర వ్యవసాయ పనిముట్లు తయారు చేయడానికీ ఉపయోగిస్తారు.

హిందీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతీ భాషలలో దీనిని శిరీష్ అనీ, తమిళంలో వేంగైమరమ్ అనీ, మలయాళంలో వేగమరమ్ అనీ అంటారు.

మనదేశపు ఋషులు!

# గాలవుడు

విశ్వామిత్ర మహాముని కుమారుడు గాలవుడు. ఒకనాటి సాయంకాలం ఆయన నదీజలంలో నిలబడి సూర్యుడికి అర్ఘ్యమిస్తూన్న సమయంలో – చిత్రసేనుడనే గంధర్వరాజు ఆకాశమార్గంలో వెళుతూ ఉమ్మటంతో, అది వచ్చి ముని దోసిట్లో పడింది. గాలవుడికి బాధ కలిగింది. పట్టరాని ఆగ్రహం వచ్చింది. శ్రీ కృష్ణుడి వద్దకు వెళ్ళి, "కన్నూ మిన్నూ కానని ఆ అహంకారికి మరణమే తగిన శిక్ష!" అన్నాడు. కృష్ణుడు సరేనన్నాడు.

ఈ సంగతిని నారదముని చిత్రసేనుడికి చేర వేశాడు. గంధర్వరాజు హతాశుడై ప్రాణభయంతో వణికిపోతూ, తరుణోపాయం చెప్పమని నారదుణ్ణి ప్రార్థించాడు. నారదుడు అతణ్ణి ఓదార్చి రత్నావళి, సంధ్యావళి అనే చిత్రసేనుడి భార్యలను – శ్రీకృష్ణుడి చెల్లెలూ, అర్జునుడి భార్యా అయిన సుభద్రాదేవి శరణు కోరమని సలహా ఇచ్చాడు.

చిత్రసేనుడు ఇద్దరు భార్యలతో సహా, సుభద్రాదేవి భవనం వెనక దిగాడు. అక్కడ ఒక చితి పేర్చాడు. చిత్రసేనుడు చేతులు జోడించి, చితి సమీపంలో నిలబడ్డాడు. భార్యలిద్దరూ బిగ్గరగా విలపించసాగారు. వారి ఏడుపు విని సుభద్ర అక్కడికి వచ్చి, కారణం అడిగింది. వాళ్ళు సంగతి చెప్పి, "మా భర్తకు మీ అన్న కృష్ణుడి .చేతిలో మరణం సంభవిస్తే, మేము ఈ చితిలో పడి ప్రాణాలు వదులుతాము!" అన్నారు.

వారి దైన్యస్థితికి జాలిపడిన సుభద్ర, భర్త అర్జునుడి దగ్గరికి వెళ్ళి, చిత్రసేనుణ్ణి కాపాడమని ప్రార్థించింది. శరణార్థిని కాపాడడం క్షత్రియధర్మం కనుక, అర్జునుడు తన అమ్ములతో చిత్రసేనుడి దేహం చుట్టూ అదృశ్యకవచం నిర్మించాడు.కృష్ణుడి బాణాలు ఆ కవచాన్ని ఛేదించలేకపోయాయి. ఆ తరవాత కృష్ణుడు అక్కడికి వచ్చాడు. అర్జునుడు అడ్డుపడ్డాడు. ఇరువురి మధ్య యుద్ధం ఆరంభ మయింది. హఠాత్తుగా సుభద్ర ఇద్దరి మధ్యకూ వచ్చి నిలబడి, యుద్ధం ఆపమని ఇద్దరినీ కోరింది.

కృష్ణుడు, గాలవుడికి క్షమాపణలు చెప్పుకోమని చిత్రసేనుణ్ణి కోరాడు. చిత్రసేనుడు గాలవముని పాదాలపైబడి, తెలియక చేసిన అపరాధాన్ని క్షమించమని ప్రార్థించాడు. గాలవముని శాంతిం చాడు. "పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదు. అతనిలోని అహంకారం పూర్తిగా నశించింది. కాబట్టి అతన్ని చంపవద్దు," అని గాలవుడు కృష్ణుణ్ణి వేడుకున్నాడు.



# మీకు తెలుసా?

1. స్వామి వివేకానంద పాల్గొన్న చికాగో విశ్వమత మహాసభ ఏ సంవత్సరంలో జరిగింది?
2. 1781వ సం॥లో యార్క్ టౌన్‌లో బ్రిటిష్ సేనలు లొంగిపోవడంతో అమెరికా స్వాతంత్ర్య యుద్ధం ముగిసింది. అప్పటి బ్రిటిష్ కమాండర్ ఎవరు?
3. మూఢవిశ్వాసాలను, కర్మకాండను విమర్శించిన హిందూమత నాయకుడు ఎవరు?
4. రొనాల్డ్ అముండ్సన్ 1911వ సం॥లో దక్షిణ ధృవం చేరుకున్నాడు. ఆయన ఏ దేశానికి చెందినవాడు?
5. ఆంధ్రరాష్ట్రం శివరాంపల్లి నుంచి ఒక ముఖ్యమైన ఉద్యమం బయలుదేరింది. దాని పేరేమిటి?
6. నూబియన్ ఎడారి ఎక్కడున్నది?
7. 'వందేమాతరం' గీతం మొదట ఒక నవలలో వెలువడింది. ఏ నవలలో? రచయిత ఎవరు?
8. ఫెర్డినాండ్ డీ లెసెప్స్ ఎవరు? ఆయన ఎలా ప్రసిద్ధుడయ్యాడు?
9. భారతదేశంలో 'టోకెన్ కరెన్సీ'ని మొదట ప్రవేశపెట్టిన వారెవరు?
10. బ్రిటిష్ సైనికుడు టి.ఇ. లారెన్స్, వేరొక దేశం తరఫున పోరాడాడు? ఏ దేశం తరఫున?
11. ఒక భారత విప్లవ యోధుడు జైలులో నిరాహారదీక్ష చేపట్టి మరణించాడు. ఆయన ఎవరు?
12. "క్రీస్తుకు అనంతరం జన్మించిన గొప్ప యూదుడు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్" అని చెప్పిన వారెవరు?
13. 'నాట్యశాస్త్ర' రచయిత ఎవరు?
14. హాంకాంగ్ నుంచి వైద్య శాస్త్రంలో ప్రప్రథమంగా పట్టభద్రుడైన చీనా నాయకుడు ఎవరు?
15. 'త్రిమూర్తి' విగ్రహానికి ప్రసిద్ధి గాంచిన గుహాలయం ఎక్కడ ఉన్నది?
16. సుప్రసిద్ధ 'అమెరికన్ లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్' ను నిర్మించిన వారెవరు?

## సమాధానాలు

1. 1893.
2. లార్డ్ కార్న్‌వాలీస్.
3. స్వామి వివేకానంద.
4. నార్వే.
5. భూదాన ఉద్యమం.
6. సుడాన్.
7. బెంగాలీ నవల 'ఆనందమఠం'. బంకించంద్ర ఛటర్జీ.
8. ఫ్రెంచి దౌత్యవేత్త. సూయెజ్ కాలువను నిర్మించాడు.
9. ఫిరోజ్ తుగ్లక్.
10. అరేబియా.
11. జాటిన్ దాస్.
12. జె.బి.ఎస్. హాల్డేన్.
13. భరతముని.
14. సన్‌యట్‌సెన్. చైనా రిపబ్లిక్ నిర్మాత.
15. ఎలిఫెంటా.
16. హెర్బర్ట్ పుట్నమ్

# బంగారు గడియలు నెం. 4 : సమాధానాలు



3. పాతబడి ఛిన్నాభిన్నమైన అంటే నశిస్తూన్న నక్షత్రం.
4. శుక్రగ్రహం. ఈ ఒక్క గ్రహం మాత్రమే తూర్పు నుంచి పడమరకు తిరుగుతూంటుంది.



1. హెచ్.జి. వెల్స్ రచించిన నవల 'ది వార్ ఆఫ్ ది వరల్డ్స్' ఆధారంగా ఆ రేడియో నాటకం రూపొందించబడింది.
2. డైయానా. రోమనుల ఈ చంద్రదేవత వేటకు కూడా అధిదేవత.



5. ఫెర్డినాండ్ మేగెలాన్. లార్జ్ మేగెలానిక్ క్లౌడ్. స్మాల్ మేగెలానిక్ క్లౌడ్. ఈ రెండు నక్షత్ర వీధులూ మనకు దగ్గర్లో ఉన్నాయి.
6. ఉత్తర అమెరికాలోని అరిజోనాలో.
7. హేలీస్ తోకచుక్క. ఇది 76 సంవత్సరాలకు ఒకసారి భూమికేసి వస్తుంది. ఇది ఆఖరు సారిగా 1986వ సం॥లో కనిపించింది.

## అంతరిక్ష సాహసయాత్ర

దాడికి అంతరిక్షనౌక అనుసరించిన మార్గం ఇదే..





# కళ్యాణి కళ్యాణం

తను అద్దెకుంటున్న ఇంటి యజమానురాలు కామాక్షమ్మ, కొడుకు ఆనందుడికి ఎక్కడో పెళ్ళి సంబంధం చూసిందని తెలిసినప్పటి నుంచీ, అనసూయకు మనసు మనసులో లేదు. ఆ పెళ్ళిముహూర్తం ఈరోజు రానే వచ్చింది.

బయట పెళ్ళి పందిట్లో బాజా భజంత్రీల మోత, పిల్లలకేకలు. ఇవన్నీ వింటూంటే, అసలే దిగులుతో వున్న అనసూయకు తల నొప్పి ప్రారంభమైంది. ఆమె మంచం మీద పడుకుని, కామాక్షమ్మ ద్రోహబుద్ధి గురించి మథనపడుతూండగా, విసురుగా తలుపు తోసుకుని లోపలికి వచ్చిన ఆమె కూతురు కళ్యాణి, "ఇంకా ఇక్కడ ఇలా పడుకునే వున్నావా? ముహూర్తం వేళయింది. వెంటనే బయల్దేరు," అన్నది.

"నాకు ఒంట్లో బాగాలేదు. రాలేను," అన్నది అనసూయ ముభావంగా.

కళ్యాణి ఒకక్షణం పాటు తల్లి ముఖంకేసి పరీక్షగా చూసి మారుమాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయింది.

ఈ తల్లీ కూతుళ్ళు రెండేళ్ళ క్రితం, ఆ ఇంట్లో అద్దెకు చేరారు. అప్పట్లో ఇంటావిడ కామాక్షమ్మ కొడుకు ఆనందుడు ఏ ఉద్యోగమూ లేక అల్లరి చిల్లరగా తిరుగుతూండేవాడు. కొడుకు జీవితంలో ఎప్పటికి స్థిర పడతాడో అని, కామాక్షమ్మ బాధపడుతూం డేది. "వీడి చేత ఏ వ్యాపారమైనా మొదలు పెట్టిద్దామంటే, పెట్టుబడికి డబ్బు లేదు!" అంటూ కామాక్షమ్మ తన కష్టాలు అనసూయకు చెప్పుకునేది.

అనసూయకు భర్త పోయే నాటికి ఉన్న యాభైవేలలో ఇరవై వేలు ఖర్చయిపోయినా, మిగతా ముప్పైవేలూ కూతురు కళ్యాణి పెళ్ళికని భద్రంగా దాచివుంచింది. ఇప్పుడు అక్కడాఇక్కడా సంగీతపాఠాలు చెబుతూ,

మాచిరాజు కామేశ్వరరావు



ఊరగాయలూ, అప్పడాలూ చేసి దుకాణాల వాళ్ళకు అమ్ముతూ గుట్టుగా సంసారం నెట్టుకు వస్తున్నది.

ఒకనాడు ఆమె, కామాక్షమ్మతో, "మేము అద్దెవాళ్ళమయినా, కుటుంబంలో ఒకరుగా చూస్తున్నారు. మీ అబ్బాయిని ఏదైనా వ్యాపారం మొదలుపెట్టమనండి. మరొక రెండేళ్ళదాకా కళ్యాణికి పెళ్ళి చేసే ఆలోచన లేదు, నాకు!" అంటూ ముప్పైవేలు కామాక్షమ్మ చేతిలో పెట్టింది.

కామాక్షమ్మ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆమె అనసూయ చేతులు పట్టుకుని, "నీది దొడ్డమనసు, అనసూయా! ఈ డబ్బు తిరిగి నీకు ఇచ్చేదిలేదు. రెండేళ్ళ తర్వాత కళ్యాణి కోడలుగా మా ఇంట్లో అడుగుపెడుతుంది!" అన్నది.

ఆ డబ్బుతో వ్యాపారం మొదలుపెట్టిన ఆనందుడికి, పట్టిందల్లా బంగారమయింది. రెండేళ్ళలో దాదాపు రెండు లక్షల పైచిలుకు ఆర్జించాడు.

అనసూయ ఇక కామాక్షమ్మ దగ్గర, కూతురు పెళ్ళి ప్రస్తావన తీసుకువద్దామను కుంటూండగా, రెండు వారాలక్రితం ఆమె ముప్పైఐదువేలు తెచ్చి అనసూయకిస్తూ, "సరిగ్గా లెక్కపెట్టుకో, అనసూయా! నీ బాకీ వడ్డీతో సహా తీర్చేశాను," అన్నది.

అనసూయ తెల్లబోయి, "అదేమిటి?దీన్ని కట్నం డబ్బుగా భావించి కళ్యాణిని, మీ ఇంటికోడలుగా చేసుకుంటానన్నారు. పైగా, ఆనందుడికి కూడా కళ్యాణి అంటే ఇష్టమే నని, ఆ మధ్య ఒకటి రెండుసార్లు చెప్పారు," అన్నది.

"రెండేళ్ళ క్రితం అన్నాననుకో! ఈ మధ్య కాలంలో పరిస్థితులు మారిపోయాయి గదా. విస్సన్నపాలెం పార్వతీశంగారు – ఈయన మనిషెంత భారీయో మనసూ అంతభారీయే అని పరగణా అంతా చెప్పుకుంటారు – స్వయాన వచ్చి, లక్ష కట్నంతోపాటు కూతురు నిస్తామన్నారు. నేనైతే సంశయించాననుకో. కాని, నీ డబ్బు పుణ్యాన వ్యాపారలక్షణంబాగా ఒంట బట్టిన అబ్బాయి, ఆ సంబంధం వైపు మొగ్గు చూపాడు. కట్నం డబ్బుతో నీ అప్పు తీర్చేశాను!" అంటూ ముఖ్యమైన పనేదో వున్న దానిలా, వెళ్ళిపోయింది కామాక్షమ్మ.

కూతురు పెళ్ళి బెంగలేదని, ఇన్నాళ్ళూ నిశ్చింతగావున్నది అనసూయ. ఇప్పుడు హఠాత్తుగా మోయలేనంత బరువు మీదపడినట్టు కుంగిపోయింది.

"బెంగపడిలాభమేమిటి? నాకింకా ఇరవై ఏళ్ళయినానిండలేదు," అని తల్లికి ధైర్యం చెప్పింది కళ్యాణి.

ఆనందుడి పెళ్ళి జరిగిపోయాక, ఇక ఆ ఇంట్లో ఒక్కరోజు కూడా వుండకూడదను కున్న అనసూయ, అద్దె ఇంటికోసం బయలు దేరింది. సాయంకాలం వరకూ ఊరంతా తిరిగినా, ఎక్కడా ఖాళీఇల్లు కనిపించలేదు. ఆమె ఉసూరుమంటూఇంటికితిరిగి వస్తూం డగా, ఒకచోట రెండువాటాల ఇల్లు నిశ్శ బ్దంగా కనిపించింది. దానిముందున్న కొబ్బరి చెట్టుకింద కూర్చుని, యువకుడొకడు ఏదో లెక్కలు చూసుకుంటున్నాడు.

అనసూయ అతణ్ణి సమీపించి, "ఈ ఇంట్లో అద్దెకు ఖాళీ వాటా ఏమైనావుందా, బాబూ?" అని అడిగింది.



యువకుడు ఆమెకేసి పరీక్షగా చూసి, ఒక్కక్షణం ఆగి, "మా పక్కవాటా నాలుగు రోజుల్లో ఖాళీ అవుతుంది.చూస్తారా?"అంటూ అనసూయను వెంటబెట్టుకు వెళ్ళాడు.

మూడుగదులతో విశాలంగా, గాలీ వెలు తురూ ధారాళంగా వస్తున్న ఆ వాటా భాగం అనసూయకు బాగా నచ్చింది. ఆమె యువ కుణ్ణి అద్దె సంగతి అడిగింది.

"ఐదువందలు. రెండు నెలల అద్దె ముందే ఇవ్వాలి," అన్నాడా యువకుడు.

అనసూయ అందుకు సరే అని, యువ కుడిచేతిలో వెయ్యిరూపాయలు పెట్టి,"మేము ఆదివారం సామానుతో సహా వస్తాం," అని చెప్పింది.

ఆదివారంనాడు అనసూయ రెండుబళ్ళలో సామాను సర్దుకుని, కామాక్షమ్మతో, "వెళ్ళి వస్తాం, వదినా!" అన్నది. కామాక్షమ్మ ముఖం చిట్లించి, "వేరే ఇల్లు చూసుకుంటున్నామని, మాటమాత్రంగా నైనా చెప్పలేదేం?" అన్నది.

"నీ కొడుక్కు వేరే సంబంధం చూసుకుంటు న్నామని, నువ్వు ముందు చెప్పావు కనకనా?" అనేసి అనసూయ కూతురుతో పాటు బండి ఎక్కింది.

ఆమె కొత్త ఇంటి ముందు సామాను దింపిస్తూంటే, "ఎవరువారు?"అంటూ ఒక ముసలాయన ఇంట్లోంచి బయటకు వచ్చాడు.

"మీ పక్కవాటాలో అద్దెకు రాబోతున్న వాళ్ళం," అన్నది అనసూయ.

"అద్దెకు రావడమా? ఆ వాటా ఖాళీగా లేదే! అందులో పదేళ్ళుగా రామన్నపంతులు గారుఅద్దెకుంటున్నారు," అన్నాడాయన ఆశ్చ ర్యపోతూ.



"వాళ్ళు నాలుగురోజుల్లో ఖాళీచేసి పోతా రని, మీ అబ్బాయనుకుంటాను, చెప్పాడు, వెయ్యిరూపాయలు బయానా కూడా ఇచ్చాను!" అన్నది అనసూయ అయోమయంగా.

"మా కసలు పిల్లలే లేరు!" అంటూ ముస లాయన భార్యను కేకవేశాడు.

ఆవిడతో పాటు పక్కవాటా వాళ్ళు కూడా వచ్చారు. అనసూయ జరిగిందంతా చెప్పాక, "సందేహం లేదు! ఆ సాయంత్రం మనం అంతా, శివాలయంలో ధ్వజస్తంభం ఎత్తుతున్నారని వెళ్ళాం. ఈలోపల బడినుంచి పంతులుగారు వచ్చేస్తారేమో అని, మాఇంటికి తాళంపెట్టకుండా మాచుట్టాలబ్బాయి రాఘవను ఇల్లు చూస్తూండమని చెప్పాను. ఈవిడ దగ్గర, ఆ వెయ్యిరూపాయలు రాఘవే కాజేసి వుంటాడు," అన్నది పంతులుగారిభార్య.

అదివింటూనే అనసూయకు ముచ్చెమటలుపోశాయి. తనను నిలువునామోసం చేసిన ఆ రాఘవమీద పీకలదాకా కోపం వచ్చింది. ఆమె ఏదో అనబోయేంతలో ముసలాయన, "ఇల్లు ఖాళీచేసి వచ్చినట్టున్నారు. సామాను ముందుగదిలో సర్దుకోండి. ఇల్లు దొరికే దాకా ఇక్కడే వుండండి," అన్నాడు జాలిపడుతూ.

అనసూయ ఆ ముసలాయనకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించి, సామాను ఆయన చెప్పిన చోట సర్దిన తరవాత, "ఈ రాఘవ ఎక్కడుంటాడు?" అని ఆయన్నడిగింది.

"కచ్చేరీలో ఏదో ఉద్యోగ ప్రయత్నం మీద వచ్చాడు. వాడు మా బాబాయి మనవడు. ఉద్యోగం దొరకలేదని, మూడు రోజుల క్రితమే, సొంత ఊరు పుల్లలరేవుకు వెళ్ళిపోయాడు," అన్నాడు ముసలాయన.

కళ్యాణి ఎంత చెబుతున్నా వినిపించుకోకుండా అనసూయ, "ఇప్పుడే పుల్లలరేవుకు వెళ్ళి ఆ మోసగాడు రాఘవ సంగతి తేలుస్తాను!" అంటూ వచ్చిన బాడుగబండిలో బయలుదేరింది.

ఆమె పుల్లలరేవు చేరుకునే సరికి, సాయంత్రం కావస్తున్నది. ఆ చిన్న ఊళ్ళో రాఘవ ఇల్లు కనుక్కోవడం ఏమంత కష్టం కాలేదామెకు.

బాడుగబండిని పంపించి, మూసి వున్న తలుపును తట్టబోతూ, లోపలినుంచి ఏవో మాటలు వినిపించి, అనసూయ నిలబడిపోయింది. "అమ్మా! నీ జబ్బుకు వైద్యుడు చెప్పిన మందులు కొనడానికి డబ్బులేదు.

నాకు పాతికేళ్ళు వచ్చినా ఇంటి బాధ్యతలు వట్టించుకోకుండా తిరగడం ఎంత నీచమైనపనో ఇప్పుడర్థ మవుతున్నది. ఎంతో ఆశతో వెళ్ళి, అమ్మకు మందులు కొనాలన్నా పెదనాన్న డబ్బు ఇవ్వలేదంటే, దోషం ఆయనది కాదు. నా వ్యసనాలకు డబ్బుకోసం, అమ్మకు బాగో లేదని చెప్పివుంటానని భావించారు వాళ్ళు," రాఘవ జరిగిందంతా తల్లికి చెబుతున్నాడు.

రాఘవ తల్లి ఆయాసపడుతూ, "బాబూ! మనపొలం కౌలుకివ్వడం మాని, సొంతంగా వ్యవసాయం చెయ్యి. నేను చెప్పినట్లుగానువ్వు అంగీకరిస్తే, నువ్వు నిజంగా మారినట్లు నమ్ము తాను. ఈ అనారోగ్యంతో ఇంటెడు పనీ చేసు కోవడం, నావల్ల కావడం లేదు," అన్నది.

"అలాగే అంతా నీ ఇష్టప్రకారమే కానీ, అయితే నేను పండించిన మొదటి పంట డబ్బు చేతికి రాగానే, ముందు వెళ్ళి పెద నాన్న ద్వారా ఆవిడెవరో తెలుసుకుని, వడ్డీతో సహా ఆవిడ వెయ్యిరూపాయలూ ఇచ్చేసి క్షమాపణ చెప్పుకుంటాను," అన్నాడు రాఘవ. తల్లీకొడుకుల సంభాషణ విన్నాక, అనసూయ మనసులో ఎంతో తృప్తిపడి, చిన్నగా తలుపు తట్టింది. రాఘవ వచ్చి తలుపు తెరిచి అనసూయను చూస్తూనే వణికిపోసాగాడు.

అనసూయ చిన్నగా నవ్వి, "రాఘవా!ఏం భయంలేదు. నా డబ్బు ఒక మంచి పనికి ఉపయోగపడినందుకు ఆనందంగా వుంది," అని, రాఘవతల్లిని సమీపించి, "ఏమను కోకండి. అనాలోచితంగా మీ సంభాషణ విన్నాను. మీ అబ్బాయిలో వచ్చిన మార్పు చూసి నాకు సంతోషంగా వుంది. మీ రాఘ వకు పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారు గదా! నాకూతురు కళ్యాణి అందగత్తె; ఇంటిపనుల్లో చాలా చురుకైనది.మీరొకసారి వచ్చి చూసు కోవచ్చు. మాకు ఏదైనా ఇల్లు అద్దెకు దొరక గానే కబురు చేస్తాను," అన్నది.

జరిగిన దానికి రాఘవతల్లి ఎంతగానో నొచ్చుకుని, "మా ఇంటిలోనే రెండు గదుల వాటా ఖాళీగా వున్నది. మీరూ, రాఘవా బయల్దేరి వెళ్ళి సామానునూ, అమ్మాయినీ తీసుకువచ్చేయండి. ఇంక మీకాఊళ్ళో పనేముంది గనక!" అన్నది.

"మా కళ్యాణి కళ్యాణం ఇక్కడ రాసి పెట్టబడి వున్నందువల్లే- ఇదంతా జరిగింది!" అన్నది ఆనందంగా నవ్వుతూ అనసూయ.






# లోభికి గుణపాఠం

ఒక ఊళ్ళో శ్రీపతీ, జగపతీ అని ఇద్దరు యువకులుండేవారు. శ్రీపతి సంపన్నుడు. జగపతి పేదవాడు. అయినా ఇద్దరికీ మంచి స్నేహం ఉండేది.

ఒకనాడు వారిద్దరూ కలిసి గ్రామాంతరం వెళుతుంటే ఒక ఊరి బావి వద్ద ఇద్దరు ఆడపిల్లలు చేదలతో నీరు తోడుకుంటూ కనిపించారు.

శ్రీపతి తన మిత్రుణ్ణి ఒక చెట్టునీడన ఉండమని, తను దాహం తీర్చుకునేటందుకు బావికేసి నడిచాడు. అంతలో అతనికి ఆ ఆడపిల్లలు మాట్లాడుకునే మాటలు వినిపించాయి; శ్రీపతి అంత దూరంలో ఆగి వినసాగాడు.

రంగుచీర కట్టుకున్న పిల్ల తెల్లచీర కట్టుకున్న పిల్లతో, "లక్ష్మీ నిజం చెప్పు.నువ్వు ఎలాటి మొగుడు రావాలనుకుంటున్నావు?" అన్నది.

"అనుకోవటానికేం రోహిణీ! నాకు పెద్ద కోరికలే ఉన్నాయి. బోలెడు నగలూ, చీరలూ కావాలి.చాలా పెద్ద మేడ ఉండాలి. బోలెడు మందిపనివాళ్ళుండాలి. భోజనంలోకి చాలా కూరలూ, పిండివంటలూ కావాలి. మనం కావాలనుకున్నవన్నీ దొరుకుతాయా?" అన్నది లక్ష్మి.

రోహిణి నిట్టూర్పు విడిచి, "నా కలాటి కోరికలేవీ లేవు తల్లీ! ఉన్నదానితో తృప్తి పడటం ముఖ్యం. నగలూ, చీరలూ ప్రాప్తాన్ని బట్టి వస్తాయి. తిండి కేమిటి? ఇంత గోంగూర పచ్చడి చాలు. జిహ్వాచాపల్యం ఇన్ని బటానీలు తిన్నా తీరుతుంది," అన్నది.

ఈ మాటలు విన్న శ్రీపతికి ఒక ఆలోచన వచ్చింది. ఆ ఇద్దరు పిల్లలూ పెళ్ళి కావలిసినవాళ్ళే. రోహిణి వంటి భార్య తనకువస్తే దుబారా ఖర్చు ఉండదు. లక్ష్మివంటి భార్య వస్తే పేదవాడైన జగపతి ఎలా తట్టుకుంటాడో

చూడాలన్న దుర్బుద్ధితో కూడిన కుతూహలం కూడా శ్రీపతికి కలిగింది.

అందుచేత అతను జగపతి దగ్గరకు వచ్చి, "బావి దగ్గరి పిల్లలిద్దరికీ పెళ్ళి కాలేదులాగుంది. మనం కూడా పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాం కద. రంగుచీర కట్టుకున్న పిల్లను నేను చేసుకుంటాను. తెల్లచీర కట్టుకున్న పిల్లను నువ్వు చేసుకో. సరేనా?" అన్నాడు.

జగపతి సరేనన్నాడు. స్నేహితులిద్దరూ ఆ పిల్లల వెనకగా ఊళ్ళోకి వెళ్ళి, పెళ్ళి ప్రయత్నాలు చేశారు. ప్రయత్నాలు ఫలించాయి. పెద్ద కోరికలు గల లక్ష్మి జగపతిని పెళ్ళాడి, అతని పూరికొంపలో అడుగుపెట్టింది. ఏ పెద్దకోరికా లేని రోహిణి శ్రీపతిని పెళ్ళాడి, అతడి పెద్ద మేడలో సంతోషంగా అడుగు పెట్టింది.

రోహిణి శ్రీపతి ఇంట అడుగుపెడుతూనే ఇల్లంతా కలియజూసి, "ఇంత ఇంట్లో ఒక్క నౌకరూ కనిపించదేమిటి?" అన్నది. శ్రీపతి తేలికగా నవ్వేసి, "నౌకరెందుకు? జీతం దండగ. మన పనులు మనమే చూసుకుంటే పోలేదా? అదివరకు ఒక నౌకరు ఉండేవాడు; మాన్పించేశాను. ఇప్పుడు నువ్వున్నావుగా? ఇద్దరమూ చెరొక పనీ చూసుకుందాం," అన్నాడు.

రోహిణి వంటకు ఉపక్రమిస్తూ, "ఏం కూరలు వండమంటారు? పిండివంటలు ఏం చెయ్యను?" అని భర్తతో అంది.

"కూరలంటావేమిటి? అన్నంలోకి కాస్త గోంగూరపచ్చడి చాలదూ? పిండివంటలు దేనికి? కాసిని బటానీలు పట్టుకువస్తా.



వాటితో నోటి ఉబలాటం తీరుతుంది!" అన్నాడు శ్రీపతి.

ఆ రాత్రి రోహిణి తన భర్తతో, "మనకు ఇంత సిరీ, సంపదా ఉన్నది గదా. నాకుమంచి చీరలూ, నగలూ తెచ్చి పెట్టండి," అన్నది.

దానికి శ్రీపతి, "ఇదుగో, నువ్వు ఇలా అడగకూడదు. సిరి ఉన్న మాత్రాన దండుగ ఖర్చులు చేయకూడదు. చీరలూ, నగలూ దేనికి? తృప్తి ఉండాలి," అన్నాడు.

"వట్టి లోభి!" అని రోహిణి తన భర్తను తిట్టుకున్నది.

మర్నాడు శ్రీపతి నిద్ర లేచేసరికి ఇంట్లో నలుగురు మనుషులు పనుల మీద తిరుగుతూ కనిపించారు.

"ఎవరు మీరు? ఇక్కడ ఏం చేస్తున్నారు?" అని అతను వాళ్ళను అడిగాడు.

"పనిమనుషులం బాబయ్యా! అమ్మగారు ఇవాళ నుంచీ మమ్మల్ని పనిలోకి రమ్మన్నారు," అన్నారు వాళ్ళు దణ్ణాలు పెట్టి ఎంతో వినయంగా.

"ఏమిటీ? ఏకంగా నలుగురే? పొండి. మిమ్మల్ని నేనెక్కడ భరిస్తాను?" అని శ్రీపతి అరిచాడు.

అంతలో రోహిణి వచ్చి భర్తతో శాంతంగా, "మీరు ఊరుకోండి. ఈ నలుగురినేమిటి? నలభైమంది నౌకర్లను భరించే శక్తి ఉన్నది మనకు," అని నౌకర్లతో, "ఇక్కడెందుకు? వెళ్ళి మీ పనులు మీరు చూసుకోండి," అని పంపేసింది.

శ్రీపతి భోజనానికి కూర్చోగానే వంటవాడు వచ్చి, నాలుగు కూరలూ, పిండివంటలూ వడ్డించాడు.

"నా కొంప గుల్ల అవుతున్నది!" అనిశ్రీపతి అరిచాడు.

"ఇస్, ఊరుకోండి. పనివాళ్ళు నవ్విపోతారు. మనం ఇంత తిని ఇతరులకు ఇంత పెట్టగలం. ఎందుకు బాధపడతారు?" అన్నది రోహిణి.

మరో నాలుగు రోజులు గడిచాక రోహిణి రకరకాల బట్టలూ, నగలూ కొని తెచ్చి తన భర్తకు చూపింది. వాటిని చూసి శ్రీపతి "బాబోయ్, నేను బికారినయిపోయాను," అంటూ బావురుమని ఏడిచాడు.

రోహిణి అతని కళ్ళు తుడుస్తూ, "ఏడవకండి. ఊరుకోండి," అని ఓదార్చింది.

"ఏడవక ఏం చెయ్యమంటావు? ఆనాడు బావిదగ్గర నీ మాటలు విని మోసపోయాను. వట్టి అబద్ధాలకోరువి," అన్నాడు శ్రీపతి.

రోహిణి ఆశ్చర్యపడుతూ, "అదా సంగతి! ఆ రోజు మాటలు విని నన్ను చేసుకున్నారన్న మాట! అయినా నేను అబద్ధాల కోరునికాను. మనకు గతి లేకపోతే సరిపెట్టుకునేదాన్నే.



ఇప్పుడు అలా కాదు గదా! కావలసినంత ఉన్నది," అన్నది.

తన సంగతే ఇలాగుంటే లక్ష్మిని పెళ్ళాడిన జగపతి ఎలా బాధపడుతున్నాడో అనుకున్నాడు శ్రీపతి. అతను జగపతి ఇంటికి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి జగపతీ, లక్ష్మీ భోజనం చేస్తున్నారు. శ్రీపతిని చూసి జగపతి, "రా! రా!" అంటూ ఆహ్వానించాడు.

శ్రీపతి ఆ దంపతుల కెదురుగా చతికిలబడి, "అంతులేని గొంతెమ్మ కోరికలుగల లక్ష్మితో ఈ జగపతి ఎలా వేగుతున్నాడో?" అని తనలో తాను అనుకున్నాడు. కాని జగపతి మొహం చూస్తే, అతను భార్యతో యాతన పడుతున్న లక్షణాలేమీ కనిపించలేదు. అతను మంచి ఉత్సాహంతో ఉన్నట్లు కనిపిస్తున్నాడు. వాళ్ళు ఉత్త గోంగూరపచ్చడి మెతుకులే తింటున్నారు. లక్ష్మి మొహంలో అసంతృప్తి లేదు. కావటానికి పూరి ఇల్లే అయినా చాలా శుభ్రంగా ఉన్నది.

జగపతి భోజనం ముగించి వచ్చి శ్రీపతి పక్కన కూర్చుంటూ, "నిన్ను కలుసుకుందామంటే తీరటమే లేదు. ఎలా ఉన్నది నీ కొత్త సంసారం?" అన్నాడు.

"నా సంసారానికేంలే? అయినా నీకంత తీరకపోవటానికి కేమిటి కారణం?" అని శ్రీపతి అడిగాడు.

"అటు చూడు, పెరడంతా చదునుచేసి, శుభ్రం చేసి, మొక్కలు నాటాం. అవి కాపుకు వచ్చాయంటే మాకు బోలెడు ఆదాయం," అన్నాడు జగపతి.

"అలాగా! అయితే, నీ భార్య కూడా నీతో పాటు శ్రమపడుతున్నదా? నగలూ, చీరలూ కావాలని నిన్ను వేధించడం లేదా?" అని అడిగాడు శ్రీపతి.

"అదేమీ లేదే!" అన్నాడు జగపతి.

"అయితే ఆనాడు బావి దగ్గర జరిగిన సంభాషణ తారుమారయిందన్నమాట!" అన్నాడు శ్రీపతి.

"తారుమారు ఏమీ లేదు, అన్నగారూ. ఆనాడు నాకా కోరికలన్నీ ఉన్నమాట నిజమే. కాని ఇప్పుడు వాస్తవ పరిస్థితిని అర్థం చేసుకుని, దానికి తగ్గట్టు ఉన్నదానితో తృప్తిపడటం నేర్చుకున్నాను," అన్నది లక్ష్మి.

శ్రీపతి గుణపాఠం నేర్చుకున్నాడు. సంపద కోరికలను వృద్ధి చేస్తుంది. పేదరికం వాటిని అదుపులో ఉంచుతుంది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 నవంబరు నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. Seshagiri



Mahantesh C. Morabad

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * సెప్టెంబర్ నెల **15**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:

చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **అక్కా చెల్లెలి అల్లిక!**

రెండవ ఫోటో : **చేసింది చాలు, దిగు ఇక!**

పంపినవారు : కె. చిన్నబాబు
స్టోన్‌హౌస్ పేట.
నెల్లూరు - 524 002 (ఆం.ప్ర)




Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

CHANDAMAMA (Telugu) September 1996 Regd. No. M. 4854